Sundari Series No. 4.

SREE

# KALAVATEE PARINAYAM

# కళావతీ పరిణయము.

*( The first two acts )*

A POEM

WRITTEN IN ADAPTATION

OF

The story of " Cymbaline " of Shakespeare, the greatest English Poet and Dramatist

BY


JAYANTI BHAVANARAYANA,

Telugu Pundit, M. L. S. School,

Jagannayakpur, Cocanada.



THIRD EDITION 500.

Vedurupaka Rayavaram,

PRINTED AT THE BHARATI TILAKA PREES,

and Published by N. V. B. Narayana Row.

1907




[PRICE Rs. 0-[illegible]-0

శ్రీరస్తు.

శ్రీ భీమలింగాయనమః

# కళావతీపరిణయము

## శుద్ధాంధ్రము.

## ప్రథమాశ్వాసము.

చ. సిరిచెలితూపు; నారి బలుచిల్వలఱేఁడు; పసిండికొండవి;
ల్లరదము నేల; ప్రాఁబలుకు లంచపుమావులు; కండ్లు ప్రొద్దుఱే
డొరలుగఁ జేసి కొట్టికలఁ ద్రుంచిన వేల్పుల వేల్పు దోసముల్
దొరఁగఁగమీటి; పుట్టువులఁ దూల్చి; మముం దరిఁ జేర్చి సాఁకతన్. I

సీ. తొగలసంగడికాఁడు తురుముపై విరిబంతి కొప్పుబాబాతాతు కొడుకుకుఱ్ఱ
చెలువునిసామేను కొలువుకూటపుటిల్లు కడిఁదికొండలఱేఁడు కన్నతండ్రి
యొడమిని నోఁడగూర్చుపడఁతుక చెలికత్తెమిన్న జక్కరచేడెమిన్న సవతి
కలికిజేజేవాలుగంటులు వరవుళ్ళు గారులగమిగొంగ వారువంబు
గాఁగ జగముల గాటంపుఁగనికరమునఁ, జూచికాపాడుగట్టురాచూలి మాకుఁ
దేనియలు చిల్కుతీయని తేటతెనుఁగు, పలుకుల నోసంగి నాల్కను నిలుచుగాత.

చ. పుడమిపడంతి పెజ్జడుపు వోవఁగఁ జేయఁగ; వేడివెల్గు వం
గడమునఁ బుట్టి బంతివులికల్గలరక్కసి రూపుమాపి; నే
ర్పడరఁగ నేఁ నేలెనెవఁ; డబ్బులు వేలుపుమానికంబు నా
యెడఁదనునిల్చి; కోరికలనిచ్చి; కొలల్ దొలఁగించి ప్రోచుతన్. 3

సీ. చిన్నివెన్నెలఱేని చిన్నారితోఁబుట్టు పెద్దడిసెడబాపు ముద్దుగుమ్మ
తెలిదమ్మి మేడలోఁ గొలువు దీర్చెడుచేమ సిరగుల నుబుమాడుగరితమిన్న

గరుడిత్తడిజోదు గారాబుటిల్లాలు కన్నులవిలుకానిఁ గన్నతల్లి
కోలలనుమబ్బులఁ దొలఁగించుచలినట్లు వేఁడువారలపాలి వేల్పుచెట్టు
తబిసికూటువ డెందపుఁదమ్మి తేఁటి, పాలమున్నీటి గారాబుపట్టి మమ్ముఁ
గనికరంబును వెదజల్లు కనులఁ జూచి, కలుముల నొసంగి యనయంబుఁ గాచుగాత.

ఉ. వేలుపుచేడె లూడిగము వేమఱుసల్పఁగ ; బాసవాల్దొరల్
మౌలిలనునిల్చి ప్రాపుకుల ముద్దుగ బల్కుచునుండఁ ; బల్కుబ్రో
యాలినిగూడి ముజ్జగము లారయుచుండెడు వేల్పుపెద్ద మ
మ్మేలుచు నెల్లకోరికల నీవుత మిక్కుటమైనమక్కువన్. 5.

సీ. కమ్మనివిరితావి క్రొమ్ముడి దిగజాతి చిన్నాఱిమూఁపునఁ జిందులాడ
జింకపొక్కిలిచుక్క చెమరుచిత్తడిబొట్టు గ్రమ్మిమిక్కుటముగాఁ జెమ్మగిల్లఁ
జెవిఁవిరి నలరాదు చిఱుతతేఁటులబారు చొక్కంపుఁ బాటను సుతులనొసఁగ
వెలిసారె లిగురునుగ్రొవ్వాళ్ళ తాఁకుడుచేతఁ జెంగల్వ క్రొంబూవురంగులీనఁ
దొలినుడులు చల్మకత్తెలై కొలిచియుండ, గొప్పతెలిదమ్మి గద్దె పైఁ గొలువుసలుపు
నలువయిల్లాలు నానాల్క నిలిచి తేనె,లొలుకుపలుకుల నొడఁగూర్చిమోముగాత

ఉ. నిబ్బరమైనబత్తి మదినొక్కన మ్రొక్కులొనర్తు నాదుబల్
కబ్బముఁ జాగఁ జేయ వెనకయ్యను; నేనుఁగుమోముసామికిన్;
గొబ్బెరపండు లుండ్రములు కూరిమి మెక్కెడుమేటిజియ్యకున్;
గుబ్బలిరాచచూలి పెనుకోరికఁ గన్నయనుంగుకుఱ్ఱకున్. 7.

సీ. తెలిపుల్గు నెఱరౌతు బలుదీమసంబేదఁ గలిగించె మేతాలుపుల నెవండు
వేయికన్నుల మేటి వీటికిసాటిగా వీడుగావించిన ప్రోడయెవఁడు
నిక్కంబు దప్పని నేలరాయుని వేల్పురాగద్దె నిలిపిన జోగియెవడు
వెన్నునితోడచూలి చిన్నికుఱ్ఱనితోడఁ గంటూనినకడిందిదంట యెవ్వఁ
డనటి. కేరింటి వేలుపుటందగత్తెఁ, దికమకపడంగ నీసునదిట్టై నెవ్వఁ
డట్టినావంగసపుసామియైన రాచ, పాఱునను, గేలుమోడ్చెద బత్తిమిగుల. 8

గీ. కొలుతు నొజ్జల నాకుండికొలపుఁ బాల, వెల్గికినినింపు నెలయయి వెలయువాని
నెల్లవిద్దెల కెల్లయై యెసఁగువాని, వ్యాసమూర్తుల బత్తినివ్వటిలమదిని. 9.

సీ. తనలోనిదాయలఁ దాలిమిఁ దెగటార్చి బ్రతికెఁ గుచేలునిపగిది నెవఁడు
కడిఁది జయంతి వంగడపుఁబాలేటికి నిండుచందురుమాడ్కి నెగడె నెవఁడు
కలనైన నొకయీఁగకొలంత నిక్కంబు విడువక మనుగడఁ గడపె నెవఁడు
కీలుకొడాడించు తోలుబొమ్మలపోల్కి జగమని యన్నింటిఁదెగడె నెవఁడు
బ్రతికియున్నట్టిమూన్నాళ్లు బత్తిమిగులఁ, బున్నియపుఁబుట్టులనె ప్రొద్దుపుచ్చె నెవ్వఁ
డట్టినను గన్నతండ్రి రామన నెడందఁ, దలచి కేల్మోచి మ్రొక్కెద నెలమిమీఱ.

సీ. తలఁపనారంబోతిదక్క నేయమ్మకు నెనయైనచెలు లబ్బరీలువునను
నేలచేడియదక్కఁ దాలిమి నేపూవుబోణికిఁ గొమ్మలు పురుడుగారు
వలమురితాలుపుచెలిదక్కఁ గలిమి నేకలికికిసరిగారు గరితలెల్లఁ
దిగకంటిచెలిదక్క దిట్టతనాన నేయింతికి వాల్గంటు లీడుగారు
బంతితేరుల దొర పట్టిపడతిదక్క, గొడవగములకు సైరించుగొనమునందు
సాటిగారే నెలంతకు బోటులెల్ల, నట్టిననుఁగన్నతల్లి వేంకమఁదలంతు. 11.

క. తొలుతం జేజేబాసను, వెలయించి యసంబుగన్న విన్నాణులకున్
గలుఁగుంబుట్టుగుదొరకుం, బులుపుట్టుగు తబిసి కెలమి మ్రొక్కులొనర్తున్. 12.

గీ. మున్ను నన్నయఁ గొండాడి మోడ్తుఁ గేలు, సోమయాజికి నాచనసోమునకును
జొక్కమగు తెల్గునకుఁ ద్రోవచూపిమిగుల, గొప్పఁగాంచినకబ్బంపుఁగూర్పరులకు.

గీ. కాళిదాసంత సుగుడికిఁ గలవుతప్పు, లనఁగ నాబోటికొదవుట యబ్బురంబె
కాంచి నెరసులఁబరియాచకంబుమాని, దిద్ద మిము వేఁడుకొనుచుందుఁ బెద్దలార!.

వ. ఇట్లెల్ల వేలుపులకు నుల్లంబున మొల్లంబగుబత్తి వెల్లివిరియం గైవారంబులు గావించి కొలపుసాములం దెలిచి, యొజ్జలహజ్జనోయికి జోహారువు లొనర్చి, తలిదండ్రుల కెరఁగి, పేరు మోసినకబ్బంపుఁ గూర్పరుల వేలువేలఁ బేరుకొని. యీలువు గలవాలు

గంటులలో మేలుబంతి యనంగాఁ బ్రోలు నొకపాత్రియాలి పెండిలికత నచ్చెనుగాఁన
నుడువంగడఁగు నదనున.

సీ. మొలను బెబ్బులితోలు, తలను వేలుపుజాలు | కొమరారు బలువెండికొండప్రోలు
పాపరాపెడనూలు పనిత్రిప్పుతొలిచూలు చిన్నారిజింకచేఁ జెలఁగుకేలు
గెలుపును గానఁజాలు గిత్తవార్వపుడాలు వలకేల ముమ్మొనల్వాఁడిచాలు
చందమామనుబోలుచక్కని మైడాలు కోరిమేన్సగపాలుఁగానినియాలు
గలుగు వెలివేల్పు గాటంపుఁగనికరమున, నాదుపాత్రంబు తనకప్పనంబొనర్ప
మదిమొదవఁజేసెఁ బెలపుఁబుమానినిగమి "సయ్యా! మీపుత్రి" యనిపేరిడుదగునంద.

## షష్ఠ్యంతములు.

క. మిక్కుటముగునక్కటికము, నెక్కొన నబ్బాసవాలునిసుఁగన కసుబుల్
గ్రక్కున నొసంగి జమునిం, జక్కాడి యసంబుగన్న జగముల్దొరకున్. 17.

క. ఎనలేనిబత్తి వెలయఁగఁ, గనుదమ్మిలఁ, బూజసేయ గాటపునెయ్యం
బునఁ జుట్టువాలు సిరిచెల్మి, పెనిమిటికి నొసంగినట్టి పెనువేల్పునకున్. 18.

క. చిరితొండఁడు తనయుఁడుగా, మఱి తలఁ దెగఁదునిమి బత్తిమదినివ్వటిలన్
నరకం గూరగనిడఁ గని, కరమునరఁగ బొట్టునొసఁగి కాచినదొరకున్. 19.

క. తిగకొటికలరాకాసులఁ, దెగటార్చి చిటికలోనఁ దెఱగంటిగమిన్
వగఁదేలిచి కాపాడినపొ జగజెట్టికిఁ గొండవిటిజంగంబునకున్. 20.

క. వినుద్రిమ్మరికూటువఁ దాఁ, జెనుమేటినటుంటుఁ బొంగు వేలుపుపెద్దన్
గనలునఁ గనుఁగొని తలఁదుని, మినబియ్యపు బత్తులకును మేలిడు దొరకున్. 21.

వ. ముమ్మరమ్ముగుబత్తి నెమ్మదినెక్కొనఁ బెక్కులు మొక్కులొనరించి యుత్కృష్ట
కటిక పుంగనియను ముక్కంటికప్పనంబుగ, నరనికనికరంబుపెంపున నాయొన
ర్పంబూనిన కళావతిపెండిలికత తెలుపఁగట్టినవిన. 22.

సీ. మేడల మగబాల మొగపురాయని గాంచి వెలిగారు భీతిచే వెనుకకొదుఁగఁ
జిల్వచెల్వ లగడ్తఁజేరి తానములాడు|వీటిబోటులతోడ వియ్యమందఁ
బలిచాన కల్కితొయ్యలియు నేస్తముగూడి మాటికి నింటింట మఱలుచుండఁ
బూఁదేనెకాలువల్ పొలములజాల్వాఱి ముక్కారుపంటలఁ బొదలఁజేయఁ
జిగురుకొమ్మైనఁ జేఁగను జెంది పొదల, మిక్కుటపుఁజక్కఁదనముల కెక్కుయుసుచుఁ
బొలుపు తెచ్చుచు గుజరాతిపుడమికెల్ల, వెలయు సౌరాష్ట్రమనఁగను వీడొకండు.

గీ. కోటకొమ్మలఁ జెక్కినగొప్పగొప్ప, మానికంబుల జిగులచే మావులెట్టి
యిరులు గ్రమ్మిన దివియల సరకుగొనక, వీటఁ జొరలాడుదురు లెంకగూటువోగిని.

గీ. పొల్తి మేడలయొప్పను; బొడవు సాలుల, చక్కఁదనమును గని కలుచందమెల్ల
నుడువదొరఁకొన్న నొకవేయినోళ్లు గలుగు,పాపఱేఁడును వాదడఁబడకయున్నె.

చ. తనసరి జేసికంటియును; దామరకంటియుఁ బూజలందుటన్
దనవుఁ గొఱంతయాట నెదఁదామరచాలి కడిందికొండలం
బును బడి వేలవేలుపుల పొల్పను దాల్చి యెల్లవారిచే
ననయముఁ బూజఁగాంచెనన నచ్చటిపాఱులు వొల్తురెంతయున్. 26.

చ. చెదుగుఁగయాశిరక్కసులఁ జెండుచునుండుటఁ దొంటిబాములన్
బుడమిని రాచబోగములఁ బొందుటకుందతిలేక వెన్నుఁడిం
పడరఁగఁ బెక్కురూపులయి యక్కొటికం గలరాచగీములం.
బొడమి సుగంబులొందనఁ బొల్తురు నాడెపు రాచకందువుల్. 27.

చ. చిలువల పేరులుం; బుసుక; చిచ్చఱకన్నును; దువ్వితోలు; పు
వ్విలు దొరబాడివీడి తన పేదతికంబును బాఱఁదోలఁ జే
మలవిలుకాఁడు లిబ్బిదొర భూని; తిరంబుగ మాను నేస్తుఁడై
పొలిచిన నంచుఁ బల్కుదురు పొల్తులఁదలిర్చెదు మేటికోమటుల్. 28.

గీ. ఇండ్లఁ దరుగనియొడమి పెంపెసఁగుచుండఁ, బాఁడి పంటల సేవంక నీడులేక
నేలజేజేలపై బత్తి గీలుకొలిపి, కరము వెలయుదు రవ్వీటఁ గమ్మతెంగ్రు. 29.

సీ. మగనిమాటకుమాఱు మాటాడియెఱుఁగదు నొచ్చిననోరను నుడువదొకటి
తిలకించుఁ దోఁబుట్టుగులమాడ్కి నొరులను గాపాడునదలఁ గనికరమునఁ
బాలియింపఁజాలదు చలిచీమనేనియు సందఱఁ దనవారి యట్లసాఁకు
దురుసుపల్కులు నాల్కతుదకురానీయదు కలనేని పలుకదు కల్లమాట
సలుపునుడిగంబు పెద్దవారలనుగన్న, విడువదడఁకువ నాననెయ్యేఁడులనైనఁ
గొండెకత్తెలఁ జేర్పదు దండనెపుడు, చెలువకెనయైన క్రొత్తడిగలదెపుడును. 41.

సీ. పొలఁతితాల్మికి నేల పువ్వారుబోణియు బాపురే! యనివింత పడిపొగడఁగఁ
గలికియీలుపునకు గట్టురాపట్టియు నరరే! పురే! బళే! యనుచుసన్నఁ
బడఁతి చక్కఁదనంబుఁ బరికించియించువిల్ దొరసానిమదినిఱుందుడుకు చెందఁ
బ్రోయాలియీగికిఁ బెంపునకుఁ జాగపుఁ జెట్టువెగ్గలంబగు నాన వెల్లఁబాఱఁ
బుడమిఁబొడమిన పలుకుపూఁబోణియనుచు, మేనుదాల్చినక్రొక్కారు మెఱుపటంచుఁ
బజలుగొండాడ బంగారుపతిమజాడ, నలరుజవరాలు రాజవాహనునియాలు. 42.

క. అయ్యాలుమగలుగాటపు, నెయ్యంబునఁ గాపురంబు నెరపుచు నెడఁదన్
దియ్యందన మెసఁగఁగమరు, నయ్యయుఁబాల్కడలి పట్టి యట్టులనుండన్. 43.

చ. మునుపొగ గోరపుంగలన మొక్కలమొప్పఁగ నిల్చిమార్తురన్
దునుముచు తనిపత్తుకను గ్రుంపఁగవచ్చెడు ముల్కికడ్డమై
తనమెయిగడ్డిపోఁచగ నెదంసలపోయుచువీడ్; సామియ
ప్పను మొగినీఁగ నేఁడతని ముద్దుపొలంతుక చూలుదాల్చుటన్. 44.

ఆ. తనమగండు కెడనెననుసుద్దియాలించి, డెందమునను మిగుల కుందిస్రుక్కి
మగువయొక్కనాఁడు మగబిడ్డఁగని మేను, విడిచియపుడెచేరె వేల్పుటెంకి. 45.

ఉ. అప్పుడు వేగవేగిపుడి యంతయుఁ జెప్పఁగఁ గుందిదాదులన్
గుప్పనఁ బిల్చి తెండు "నిసుఁగుంగొనితెండ" నియానతీయనా
చొప్పనఁ దెచ్చికందువును జొక్కపు టంతిపురంబుఁ జేర్పఁగా
నుప్పిరిగొన్న మక్కువను బోషిచెను తని యనుంగు చానయున్. 46.

క. తనకుంబిడ్డలు లేమిని, దనబిడ్డనిపగిదిఁ జూచి తలిదండ్రులు వో
యినఁ గొఱఁతయొదవకుండఁగఁ, గనిసాఁకుచునుండె ఱేఁడు కనికరము మెయిన్.

గీ. అంతఁ గొన్నాళ్లకా ఱేనియనుఁగుమగువ, కడుపుదాల్చుడుఁ జిట్టముల్లడితమయ్యెఁ
గోరికలు మిక్కుటంబయి కొనలుసాగఁ, గానునకుఁ గల్గెనొక వింతకలిమి పెంపు.

గీ. పగడపుం జిగిఁ దెగడెడు చిగురుమోవి, మొల్లపూవు తెఱంగున వెల్లఁబాఱె
మించువాలును గేరెడు మెలఁతయారు; నల్లత్రాఁచును బలుమాఱు నవ్వఁజాఁగె. 49

గీ. పుడమిపూఁబోణి యాలేమ కడుపునందుఁ; గూఁతురై పుట్టవలెనను కోర్కిఁ జేసి ద్రవ.
మన్ను గాలోనఁ జొచ్చుచునున్నదో యన, మగువకును మిక్కుటంబయ్యె మంటిచొ

క. అడుగామడయయ్యె; నడకలు, కడుఁదొట్రిలె; బడలికలును గాటంబయ్యెన్;
దొడవులొకకొన్ని సడలెను, బడఁతుకకును జూలలోకింతవుఱలెడునదనన్. 51

గీ. నెలఁతుకకు నిట్లు తొమ్మిది నెలలునిండె, నంతనొకనాఁడు బంధుగులలర; సాటి
కాంతలు గంటలు హోళిమైఁ గడనసేయఁ, గనియె నారామిటారిచక్కని కుమారు. 52

వ. అప్పుడు రాజవాహనుం డింతంతనరాని సంతసంపు వెల్లువుజాలున నోలలాడి; యిలువేల్పులకు హెచ్చిమీఱ జోహారువులొనరించి! కడునడఁకువను బుడమియొడయండ్రు తనకిడిన యుడుగరలఁ బుడమిజేజేలకుఁ బసదనంబుగ నొసంగి; యొక్క చక్కని మూహూర్తంబున గారాబుకూఁతునకుం గళావతియనియును; దనకు సుఖులొసఁగిన విసువాసంబునం జేసి పడవాలుబుడుతకు విజయసారుం డనియును; బేళ్ళిడి డెందంబున మఱియొక తెఱఁగున నలుదలఁపక యిరువుర నొక పరుసునఁ బరికించుచుఁ గంటికి ఱెప్పయుంబోలె నరసి కాపాడుచుండె నటు పిమ్మట. 53

గీ. పూవిలువజీరు సోయగమునను సవ్వ, ముద్దుకొమరుల సరవి నాముద్దురాలు
కాంచెనిరువురఁ దనదువంగడపుఁబాల, వెల్లి వెలయించు నిండుజాబిల్లులనఁగ. 54

గీ. రాజవాహనుఁ డెంతయుఁ రహిని పెద్ద, వానికిడెయెను బేర్వీరసేనుఁడనియుఁ
జెఱుతవానికి విక్రమసేనుఁడనియు, విందులందఱు సంతోసమొందుచుండ. 55

చ. బుడుతలకిట్లు పేళ్ళనిడి ప్రోచుచునుండఁగఁ గొన్నినాళ్ళక
య్యొడయనిముద్దులాఁడి మెయినుప్పతిలెందెవులొండు; వెజ్జుల
ప్పాడుకలమందులెల్లఁగొని పోయియొసంగిరి కానియించుకేఁ
బోడవడదయ్యెమార్గ్మము పొందినయట్లు వెలందిమిన్నకున్ 56

క. ఇట్టులుగోరపుఁదెవులున, నెట్టెట్టోకొన్నినాళులిడుమలఁబడిమై
నట్టె! దిగవిడిచె; బుజపుం, బుట్టువుదొరముద్దరాలు పొగులఁగవిందుల్. 57

గీ. అప్పుడేలిక తనజవరాలువేల్పు, పట్టుఁజేర నెడందనుబట్టుగాల్చు
ను తలపుటింగలంబునకోర్వలేక, తోయ్యలిఁదలంచియిట్లువందురఁదోడంగె. 58

చ. "పడఁతిరో! తోడినీడవలెఁ బాయక యుండెడు దానవిప్పునన్
విడిచిసురుంగఁగాఁదగునె వేలుపు టెంకికి; నింక నెట్టునే
నిడివిగఁబొంగివచ్చుబలు నెంజిలిసంద్రమునీఁదుదున్; గటా!
యొడలుదొరంగకుండ నెటులుగ్మలిరో! నిలుపంగనోపుదున్. 59

క. నీమేనన నామేనన, నోమగువా! వేఱుకలదె! యొక్కటికాదే
నీమేనిఁగానకున్నను, నామెయినిముసంబునిలుచునా? విరిబోణీ! 60

సీ. సకియరో! నామాటజవదాటియెఱుఁగవు బొంకులమారులపొంతఁబోవు
పెనుబూటకపుమూటలనుజెంతఁజేర్పవు గయ్యాళిచెలులను గాంచఁజనవు
కొలువుడుకాంద్రనెక్కుడుకూర్మిఁబ్రోతువు కోర్కెమైననదలకుయ్యివిందు
కనుఁగొంచువోకచిల్లిగవ్వగాఁజెఱసొత్తుఁ బరుసంబులాడవుపలువనైన
విందులంచును జెఱలంచుపీసమైనఁ, దలఁవవటనీదు డెందపుఁదమ్మినకట!
పొందఁగలననెనీవంటిపూవుబోణి, నువిదరో! యింక వేయిపుట్టువులకైన. 61

గీ. కనులపండువునకుముగింపునుబొనర్చి, యెలమియును మేడవాకిలితలుపుమూసి
మదిగాను నెడవెనుదివ్వియుపట్టుపెట్టి, నన్ను నదఁజేసిచనితివేవన్నెలాఁడి. 62

గీ. కటకటా! నోరెఱుంగనికందువులను, నమ్మికొలిచెడునుడిగంపుఁగొమ్మగముల
నసుఱులొక్కటిగానున్నయువిడనంపు, నపలిచెనసెట్లుమదిగొల్పెవాలుగంటి! 63

మ. అని యిల్లింతయుఁ గొందలంపడుచు నయ్యారంపుఁ గ్రాల్గంటి మే
ల్గానముల్ చెయ్వులు వేమయిన్ దలఁచుచున్ లోలోఁగ మారిల్లుచున్
గనులన్ ముంతలఁ బోసినట్టులుగ నీర్గాఱన్ వగం బొందున
మ్మను ఊనింగని యూఱడించుచని రమ్మంతుల్ కడున్ బ్రీతిమై. 64

క. దిట్టతనంబున జేజే, గట్టును మేనత్తికమాడఁగలదిట్టఁడవీ
విట్టులను గట్టు చెడికడు, బిట్టుగ వాపోవఁ దగునె వెంగలికరణిన్. 65

క. కటకట! రారేవెలుఁగా!, దిటవించుక లేక నీవదిగులొందినచో
నటమటముదీర్చుమనుఁ జెం, గటఁ జేరిచి యింక నెవరు కాతురొ? చెపుమా" 66

ఆ. ఇట్టి ప్రెగడలాడునట్టి చల్లనిమాట, లెల్ల ఊనిమదికి జల్లనంగఁ
బోసినట్టి నీటిపోలిక వితగాఁగఁ, బెద్దమంతువలుకు నొద్దఁ జేరి. 67

వ. "అక్కటకటా! రాచక్కలదొరా! వెక్కసంపుటిక్కటులను మరి చిక్కంజేసి నిక్కంపుఁ జెలివితేటలు వీటిబుచ్చుట నీబోటి మేటికిం బాటియగునే? మేయితాలుపులకుఁ బుట్టుటగిట్టుటలు మొట్టమొదటనే కట్టిఁడి తామరపుట్టువు విన్నను పనబన్నియుంచెఁ గావునఁ బుట్టినవెల్లం గిట్టుట సాజంబు. తోడినీడపోడిమిని వీడక యనయంబు మిత్తి వెనువెంట హత్తియుండి తటిఁగని పెట్టి యెట్టిబరవసంబుగల జెట్టులనైన నొక్కపెట్టునఁ బొట్టంబెట్టుకొని పోవుం గాని నెలకలంతవట్టు నట్టికట్టుకొని యుయ్యెలలూఁగనిచ్చునే. వేలుపుల తెరువును మేలమాడ నొక్కోయన నిబ్బరంబుగఁ జెలిగిన గుబ్బలులకును; బుడమిపడఁతుకకు మొలనూలివడువున నడరుకడలికిని; గారుల నాలింట నెడ తెగకుండఁ బాలు నేయులకును; గోరంపుఁ జెలమాటును గూరుచు మిత్తి చెలువకుం బులుపులుపరకలుగాక మానిసి పురువులన నొక లెక్కయే. బాటల బాటసారులును; గడలిం బడవలమాలుములును; వెల్లువలం బుల్లలగుంపును; వేలుపు తెన్నున నిరుతాలుపుజాలును; గూడి వీడుజాడను గాపురపుఁ గడలి నాలుమగలు; నన్నదమ్ములుఁ; దల్లిదండ్రులు మొదలుగాఁగల బందుగులు పొందుగఁ గొన్నాళ్లు కూడియుండి పిదప వీడుచుందురని పెద్దలుత

ద్దయు వక్కాణించిన సుద్దుల నాలకింపలేదే. ఇందులకై వగలం బొగలందగదు. కావున మనవయోడంగల తగులంబును దిగవిడిచి; బగబగరఁ లెడు బిగులును దిగఁద్రావి; తెలివి దివ్వియ డెందంబునం గ్రమ్మకొనంజేసి దొరిన గారాబు టొయ్యాఱికి నోరెపుఁ గళ్లును; నీరును; నూవులును మొదలుగాఁగల పెఱచెయ్వు లొనరింపు" మనవుడు నారాబొబ్బ మొకంబుకొంత నిబ్బరంబు నెమ్మదిఁ బ్రబ్బికొనంజేసి తన వన్నెలాఁడికిఁ బున్నియపు జగంబులబ్బుట కెన్నెన్నియో పెఱజగపుఁ గర్జంబు లొనరించి కొడుకులం గూఁతుం జూపెట్టుకొనుచు నెట్టెటో మనుగడ గడపుచుండె నంత కొన్నాళ్ళకు.

ఆ. ఉన్నవాండ్రఁ జూచియుడు కొర్చుకొనుచుండఁ, గన్నుఁ బ్రామికొడుకుఁ గవ నెవం
డో, దొంగిలించి పేసురింగఁ; దానె చూటికో, కీడు తఱిని మేలు కూడుటరిది. 69

క. వెతకుడుచుఁ జుదనకొమరుల, వెతకుటకై కడలకెల్ల వేగరిమూఁకన్
బతనమునఁ బంచు నెడయుఁడు, వితయయ్యెన్ వారలెంత వెదకినఁ దుదకున్, 70

ఆ. అపుడు రాచసింగ మారాటమును బొంది, తనయునుంగుకొమరులనుదలంచి
కనుల వేఁడినీరు కాలువలై పాఱఁ, బట్టరానివంత నిట్టులనియె. 71

సీ. "చిన్నారిపొన్నారి చిలుకకందువులార! బలుపున్నియంబుల పంటలార!
కలువలనూడు వంగడపుఁ గ్రొన్నెలలార! సొనబైనరతనాల కొట్టులార!
కలుకులు మెచ్చుచక్కఁదనంపుఁ గనులార! మురిపెంపుముద్దుల మూటలార!
రాణవొప్పారెడు రాచయేనుఁగులార! దొరలేని నాపాలితొడవులార! (కడలు
పోయితిరె! యక్కటా! నాదు పొందు విడిచి" యనుచుఁ బలుమఱు వెతలొందు; నన్ని
కలయ బరికించుఁ; జలవోర్చు; నలువఁ గీత, నెడదనుదలంచి రాపడు వెడఁగుపగిది.

గీ. అంతపల్లాయనంబు వారరుగుదెంచి, పలుతెఱంగుల నూఱడింపఁగఁ గలంత
కొంత దిగఁద్రావి దిటవును గుదురుపఱిచి, యెట్టులెట్టులొ పొద్దులు నెట్టుచుండె.

గీ. తప్పిపోయిన కుఱ్ఱలు తనకుమరలఁ, బొడపడక యున్నఁ దనయాఁడు బొట్టియును
దనవిలాఁతినొసంగి యల్లునిఁ గొమార్తెఁ, దనకడ నయుంచుకొనుటకుఁ దలఁచె నేఁడు.

వ. ఇట్లు తలంచి తన డెందంబు తీఁగని కొండలంబున మునింగియున్న కతనం జేసి రా
చఱికపుఁ బనులకై సేవపాడమి; యవి యెల్లం బనఁ బెగ్గడతలనిడఁ బోవనతండంగు
లకియ్యకొనక తనయొడయనికి మరల పెండిలిపై నిచ్చయొదవించి వెనుకటియొడ
రులకు విడుమరగావింప నెంచి యిట్లనయె.

సీ. "కడిఁదికొండలములకు గాటంపుఁజీఁకటుల్ తొలఁగింపఁ జేటవెన్నెలనెలంత
సెరగులక్గోనఁ-జెచ్చెరఁ బన్కులానరింపబలితంపుగంప్రగొడ్డలి నెలంత
దోసంపుటసటవండుచున్నయదనునఁ జేయిచ్చి ప్రోవ నెచ్చెలి నెలంత
కషలేనిగడితంపుఁ గాపురంపువిలాఁతి నోడఁగూర్చినడుపఁ బెగ్గడనెలంత
యెడఁదనంటినయుడుకులవడినడంపఁ, జలువలనొసంగుపన్నీటికొలను నెలఁత.

చ. అలసటనొందిడయ్యు నెడనల్లననంచ తెలంగుమీఁబఁబ
జ్జలకరుదెంచి; తావివెత చల్లెడుపైఁట చెఱంగునన్ మెయిన్
జలువలె సంగవీచుచును: జక్కెరపల్కులమించుతీయనౌ
పలుకులనాడిలోఁగలఁత పాచునదారయఁ బెండ్లమేగదా.

ఆ. కొలలనెల్లమాపుఁ; గొందలంబులఁ జోపుఁ, గొలము పెంపుచేసికొనబుచూపు
నాలిఁ బోలినట్టిదాలియే గాక పే, ఱొండు లేగు సుమ్ము పండిమగఁడ!

గీ. ప్రెగడవితమునహితవును వినిచి; కన్న, తల్లికై వడినోరెమెంతయునొసంగి;
పనులబానిసవలెఁ బాటుపడి; సుగంబు, వెలవెలఁ బివోలెఁ గూర్చును జెలువమిన్న.

గీ. మనువమగవానియొడలిలో సగమటంచుఁ, బ్రానుడుగులాడుచుండును గానఁ జాన
లేనివాఁ డారయఁగ నఱమానిసిసుమి, రేవెలుఁగువంగడపునిండు రేవెలుఁగ! ౪౦

గీ. కనుక నామాటకాను గాదనక! సోయ, గంపుగనియగునొకవాలుగంటికేలు
పట్టి; మమ్ములసంతోసపెట్టి; నిలువఁ, బెట్టుమీయిల్లు; చెలఁగఁ గంగఁ జుట్టలెల్ల"

గీ. అనుడునమ్మాటలకు నెదనలరి చేఁడు, మంజుభాషిణియనియెడుమగువనోర్తుఁ
పెండ్లియాడెను గానియా వెలఁది మొదటి, పెండ్లమునుబోలుగొనము లెవ్వియును లేక.

సీ. అనయమ్ము వెఱఁగీసులను ద్రిమ్మరుచునుండు జంకదొక్కించుక బొంపటపను
బలుసుపల్కునటు బాసలు పెక్కులొనరించు నలుసు సెందము దోసముల నొనర్ప
మగని మాటను దాఁటు మొగమోటనొందదు కల నేని దలఁపదు కనికరంబు
పనివాండ్రఁ బురువులపగిది నిబరికించుఁ దనమేలె తాఁ గోరికొనుచునుండుఁ
దోడిచేడెలతోఁ గయ్యమాడు చెపుడు, గరువపడుచుండుఁ దనకున్న కలిమి నెంచి
యొంతవారల నేని యునీసడించు, మంచిచెడుగు లెఱుంగక మ్రించుబోడి. 83

గీ. ఆజగాజంత తనయొడయని తలంపు, నెఱిఁగియున్నది గావున నెట్టులైన
సవతికొమరి తెనల్లుఁడౌ చంద్రవర్మ, కిచ్చి పెండిలి సేయింప నెంచికొనియె. 84

క. స్ఖలితపిమ్మట నాతని, నేలికయని పేరువట్టియెల్లపుడమిఁ దా
నేలుచు హాయిగ; సరినవ, లాలన్ మీఱంగ నెదఁదలంచె నసమునన్. 85

గీ. అక్కుతంబునఁ దనమది వెక్కసంపు, టలుకగలదయ్యుఁ దేనియలొలుకఁ బైకిఁ
బలుకుచుండెను దనమాఱుపట్టితోడఁ, గసవుగప్పినబలుబావికరణి నపుడు. 86

క. తనచేరువ దారబుడుతకుఁ, దనయునుఁగుంగొమరి తెసనుదసు నొజ్జలతోఁ
డనుజదివించెను విద్దియ, లనువుగ నాయొడయఁడెల్లఱుసనునొంచన్. 87

క. చదివెడునదనున నొజ్జల, కెదురుక అపునట్లువార లెల్లచదువులన్
దుదదనుకఁ జదువఁదొడఁగిరి, యదిరా! యని చూప జెవలనబ్బురపడఁగన్. 83

ఆ. చదువఁ జదువఁ దెలివిఁ బొదలిరాయిద్దఱు, విద్దెలందు మంచిబుద్ధులందుఁ
బొడమి యొపుడు నాటిపోని సంగాతమున్, దివ్వెకూడమునులనివ్వటిల్లె. 89

సీ. చదువులు చదివిరా మొదటి వేల్పని యుసనయుంచుఁ దలవంచు కొనకయున్నె
కబ్బంబుఁ గూర్చిరా కలుఁగు పుట్టునని రాబారియే నియుసిగ్గుపడకయున్నె
పీణియల్ మీటిరా వినుచూలిచూలియేన్ గిడిగిళ్లులొనరింపఁ గడఁగకున్నె
బవరంబొనర్చిరా బంతి తేరుల జేని పట్టి కేళియు బీతుపుట్టకున్నె
యెల్లవిద్దియలకు వీరెయెల్లయనుచు, నందఱును వేయినోళ్ళఁ గొండాడుచుండఁ
బురుడు లేక చెలంగిరా పుడమిఱేని, యనుఁగుబొట్టియుఁ బడవాలుఁగ నినపట్టి. 90

గీ. ఇట్టుకొన్నాళ్లుగడవనయ్యిద్దఱకును, జిఱుతతనమించుకించుకతొలఁగిపోయి
యెల్లసుగములకెల్లయైయెసఁగదు నెల, జవ్వనము మొలకెత్తఁగఁ జాగెనపుడు.

సీ. కలువఱేకులకువంకలనొత్తుకనుఁగవఁ దనిసిగ్గొకించుక గనిసియాడ
నలఁతిలేనగవు వెన్నెలగుంపులెంతయు మోము కల్వల కొనిముసురుకొనఁగ
మురిపమింతయులేనిముకుదళేఁబలుకులఁ జిన్నిపూఁదేనియల్ చిందుచుండ
జెలువమన్మిన్నేటిచుఱలలోయనంగ నూగారుతోడ నెతఱులలమికొనఁగ
వేల్పురాతాల నెఱిసిరుల్ విన్నఁబుచ్చ, నడల బెడఁగున నేనుంగు నవ్వుచుండ
నాఁడునాఁటికి మేల్జవ్వనంబు మిగుల, గొనలుసాగఁదొడంగెన కోమలికిని. 92

ఆ. చెలువు రూపుగొనిన చెలువున; బంగారు, పతిమయుసుఋదాల్చుపగిది; మెఱుపు
పుడమినిల్చినట్టి వడువున; నక్కొమ్మ, జవ్వనమునమిగుల జూనుమీఱె. 63

సీ. మోముసింగారంపుమున్నీటఁబొడమిన తెలిదమ్ములట్లుకన్నులు చెలంగఁ
జందురునందున్న కందుమాదిరి మొగంబున నూగుమీసాలు పొలుపుమీఱె
నలరువిల్దాలుపుకోలువుకూటపుఁబీటపడువున యొన్మొనతో వెడఁదయయ్యె
నేనుంగుతొండంబు నెక్కసక్కెములాడు పోలికఁ గేల్దోయి పాదవునూపె
నెలుఁగుమబ్బులరవలిని గెలువఁజాగె, దిట్టఁదన మెంతయును మదిఁబట్టువడియెఁ
గూర్మిదళవాయి కాంచిన కొమరునికిని, దలిరుపాయంబుగలిగెడు తఱినినంత. 94

చ. వలపుల పట్టుకొమ్మ; తెరువర్లకు బెబ్బులి; జాజికొమ్మ స్వం
దలఁపనికీడు; తుమ్మెదల దండునకుం దొలినోముపంట; రా
చిలుకలమూఁక కిమ్ము; పెమ చెట్లఁ జిగుర్పఁగఁ జేయుసామి; కో
యిలగమికొటపట్టు; చెలువేమన నామనివచ్చెనయ్యెడన్. 95

సీ. రాచిల్కలకునక్కరంబులనబ్బసంబొదవింపవచ్చిన వెజ్జనంగఁ
గెంపుకన్నులుఁగఱాగుంపువాకట్టుల విడిపింపవచ్చిన వెజ్జనంగ
మోహిఁడులనంటిన ముసుకసలితనమెల్లఁ బాపవచ్చిన నిరాబారియనఁగఁ
బొలయల్కగలయాల్కగలచేడువనుగూర్మి గలుపవచ్చిన చెల్మికాఁడనంగ

తెలఁగివిడిచికలంగెడువేటకొండవ్రి, బొబ్బలిడఁజేయు పేనుగుండు దెబ్బయనఁగ
నెల్లవారలమనములకు నెలమినొసఁగు, నామని దెలంగెమిగులసొంపావటిలఁగ. 96

ఉ. పండినయామ్రఫలాళ్ళిపరంపరఁజిగుళ్ళనుదాల్చి చెట్లుక
ప్పండునొనర్చెఁ; గానయును పైవలియామని తానిరాకరున్
నిండుతమింజెలంగికడు నేర్పుగఁ బ్రాఁదొడవుల్ వినర్చుచున్
మెండుగఁ గెంపుటానగలమేననుదాఁగయి నేసెనోయనన్. 97

సీ. బట్టులై పులుకానిపిట్టలగ్గింపఁగోయిలకూఁతబూరకొమ్ములుగ మొరయ
జిగురుటాకులులాలు జెండాలచాలుగ నెల్లకు మ్మొదదిమ్మువెల్లువలుగ
మొగిలిపూరేకులుముల్కులగని గాఁగ వలిగాలియులివు బేరులుగ వఱలఁ
దనకుదగ్గఱచుట్టమై తనరుననలరు. విలుదొరనుగూడి సంపెగవిరుల తేరి
నెక్కితెరువర్ల నేఁచఁగ నెదఁదలంచి, దాడివేంచేసె నామని చేఁదుహాళి. 98

గీ. అడవికన్నెకు నామనియొడయనికిని, బెండిలియొనర్పవదనను వెలఁదిమిన్న
యుడీనము త్రెంపుఁబ్రొలనడరెఁగాన, నెలైడలమల్లె మొగ్గలు పెల్లుగాను. 99

సీ. చిలుకలపలుకులెతొలినుమువులు గాఁగఁబలు మొగడలు సేసఁబ్రాలు గాఁగఁ
దేఁటులరొదపెండ్లిపాటలగమి గాఁగ నజొంపములుదోరణములు గాఁగఁ
గలికికప్పురపుఁదిప్పలుతిన్నియలు గాఁగఁ బుష్పాళుల్ గందంపుఁబొడులు గాఁగఁ
దలఁబ్రాలుమల్లెపువ్వులకూటువలు గాఁగఁ దీఁగెపూఁబొదలుపందిరులు గాఁగఁ
మిఁపులపూచినమోదుగుపువునివాళి, పళ్లెరము గాఁగ; వలికరువలినిగదలు
చెట్లమోఁతలు బేరులై చెలఁగఁ; గాన, చేడెనామనిదొరపెండ్లియాడెనపుడు.

గీ. మున్నెపోయినవలపులుపొడమెమఱలఁ జెట్లులకుఁ; గెంపుకన్గలపిట్టలకును
జెడియెఁజిననాటికాఁకలచెలిమియపుడె, జగమునకుఁబఱ్వెనొక వింతజవ్వనంబు.

క. అడవియనుపడలియలరను, కొడుకునుగనెనన్న మాటగుప్పనవినియ
ప్పుడె కోకిల్లలనిపఁధౌతఁగాను, గడుసంతసమునను గ్రుడ్డుకానుపులెల్లన్. 102

సీ. గుజ్జుమావులమీఁదఁ గూర్చుండి చిలుకలు విరివిల్తుపొత్తంబు విప్పి చదువఁ
గడిమిచెట్టులఁ గెంపుకంటులింపుగఁ బాడి వలఱేని నిదుర మేల్కొలుపుచుండ
జాజిపూఁబొదలలో జమిలిముక్కాలులు తియ్యవిల్కాని పద్దెములు చదువ
సంపెఁగక్రొంబూవుచప్పరంబులఁ దేలి పులుఁగులు మరుపాట చెలఁగి పాడఁ
జలువలనెసంగు వలికరువలి నిసుంగు, చెఱకువిలుదొరరాక మచ్చికను నొడువ
వేడుకలకెల్ల నెల్లయై వెలయుచుండెఁ, బూవుతోఁటలు గడితంపుఁ బొలుపు మీఱి.
సీ. జముకడపడఁతుకకొమరుఁడై కొనయన్నిరి పెంపఁ బొదరిండ్లఁ బెరిఁగి పెరిఁగి
తేఁటిబోటుల జోలపాటలఁ గడుఁ జొక్కి తీఁగెయుయ్యాలలఁ దూఁగి తూఁగి
తమ్మిపూఁ జెలువుల కమ్మబూఁదేనియ లాను చు జలకంబు లాడియాడి
కడు నెమ్మదిని నడకలయందుఁ దలకూర్చి పుప్పొడితిప్పలఁ బొరలి పొరలి
చిన్ననాఁట నెమిక్కిలి చేవగలిగి, తెరువరులఁ బట్టిపీడించు తెఱఁగెఱింగి
సాదనయొనర్చు చామని సామియాన. మరునిచెలియై మెలంగుఁ బెమ్మెర నిసుంగు. 104
వ. ఇట్లెల్లయుల్లంబుల కింతంతనరాని సంతసం బొదవించు ననకారు సాఁగుచున్న
యదనున.
సీ. తొలకరికల్కిపుల్గుల నెన్నడలదిద్దు మెట్టదమ్ముల జిల్గుమట్టెలలర
నీలికల్వలడాలు డీలు సేయఁగఁ జాలు కనుఁగవ నలసిగ్గు గడలుకొనఁగఁ
జిందంబు నొగినవ్వు నందంబు గలకుత్తి కనుముత్తియపుఁ బేర్లు క్రాలుచుండఁ
దలిరుటాకులఁ బోలు కలికి కైదమ్ముల విలువటొల్గలయుంగ్రములు చెలఁగ
నసదుకౌనున కొడ్డాణమంద మొసఁగఁ, జెవులకునుఁ గమ్మలొక వింత చెలువు గూర్పఁ
బుడమియొడయని గారాబుబుడుతవచ్చెఁ, బూవుఁదోఁటహొరంగును బొడగనంగ.
ఆ. ఇట్టులొక్కరితెయు నేతెంచి యాయింతి, మిన్నయొక్కపొన్నగున్నపొంత
వెన్నెలదొఢతాలతిన్నెపైఁ గూర్చుండి, కొంతయలఁత దీర్చుకొనుచు నెదుట. 107
సీ. విరితేనియలతీపు వేడ్కఁ గొంగ్రొత్తసుఁ జూపు బలితంపుఁ దేఁటిబోటులహొరంగుఁ
బండ్గుఱ్ఱులుడుల్చివగ కొంగ్రొనొగిఁ బల్కి యపచారపుఁ బల్కు సరసలపొలుపుఁ

జిగురులఁ దమకిచ్చు చెలిమికాండ్రను మెచ్చు చెలువంపుటాఁడుకోయిలలసొగసుఁ
దమ్మితూఁడులొసంగు నెమ్మికాండ్రబెడంగు తలఁచు రాయంచతొయ్యలులహొసు
గాంచి; తమిమించి; యెలమినగ్గించి. "యరరె! చెఱుకువిలుకాఁడ! నీపనుల్చిట్టకములు
రెంటినొక్కటిచేసెడుదంటతనము, నీకకలద" నికొండాడె నెలఁతమిన్న. 108

గీ. ఇట్లుకొండాడి "కోరినయెమ్మెకాండ్రఁ, గలసిదొరలేనిసుగములఁ గాంచుటకును
బులుఁగులే మేమిచేసెనొ పున్నియములు, బత్తివెలయంగఁ దొల్లింటిబాములందు. 109

గీ. అట్టికలిమికి నేనోఁచనైతినకట, తండ్రి నెనరేది నామాఱుతల్లిపలుకు
వీనులనుజొన్పి నన్నొక్క వెడఁగునకును, బలిమిమైఁ గట్టిపెట్టఁగఁ దలఁచె మదిని.

సీ. తలిదండ్రులాడుపల్కులకియ్యకొంటినా దొరబిడ్డపైఁ జెల్మితొఱఁగవలయు
మదిలోనికోర్కి తెల్పుకునయ్యకంటినా మేరమీఱినసిగ్గునోరునొక్కు
ననుఁగునెచ్చెలులకు వినుపింతునంటినా వెలిసుబ్బునోయన్న వెగడునెందు
ఎడఁదత్తవలవంతనడఁగింతునంటినా వలఱేఁడె నాగుట్టుబయటఁ బెట్టుఁ
చిన్ననాఁటనుండి విజయసారునిమీఁద, జెలిమివలపుతీఁగ తలఁపుమడిని
బాదులఁ జేసి యిపుడు పురువుగొట్టెకుతతి, కాంచి సైచుటెట్లు! కాచుటెట్లు!" 111

అ. అనుచుఁ దనదుడెందమున నగ్గలపుఁగొంద, లంబునొందితనతలంపునెట్టు
లైనఁ దీర్చుకొనుటకంకిలిలేకుండ, ననువునరయుచున్నయదనునందు. 112

సీ. తనతేజుచే జగంబునకు బంగరువన్నె గలిగించుమినుమానికంబువోలె
నిద్దంపుఁ బండువెన్నెలలచేఁ దనియించు దొరలేనినిండుచందురుఁడువోలెఁ
గ్రమ్మినపొగనొక్కకడఁ ద్రోచి వెలుఁగొందుసతనాలుకలవేల్పుసామివోలె
పలుపుగుంపుల నాల్గువలఁకుల వెదచల్లు గొనబైన క్రొమ్మావిగున్నవోలెఁ
జెఱుకుపాలకుఁ జవులనుగఱపఁ జాలు, కులుకుపలుకుల నలరురాచిలుకవోలెఁ
జెలువుమీఱెడు దళవాయి చిన్నబిడ్డఁ, డల్లనల్లనఁ బూఁదోఁటకరుగుదెంచె. 113

క. అరుదెంచి చలువపూఁజ, ప్పరముల నడయాడి; చాఁకపందిరులకడన్
దిరిగి నెలతాలుడాసిన, యరఁగలుపరికించి; యరుసమందుచు నెదుటన్. 114

సీ. పెనుమానికములుదాపినపొన్న బొమలకు వెలలేనితనరూపు వేల్పుగాఁగఁ
బులుకాసిపులుఁగుగుంపుల కెల్లఁదనపల్కు మంతు కెక్కిన మేలుబంతిగాఁగ
జడిజాలిపిట్ట నెన్నడలకుఁదననడయొఱపు నేర్పెడి మేటియొజ్జగాఁగ
గందంపుమలమీఁదికమ్మ తెమ్మెరలకుఁ దనయూర్పు చిఱుగాలితల్లిగాఁగ
మిసిమిఁదులకించుతొలుకరి మెఱుపనంగఁ, జికిలిచేసినవల జేని చిలుకనంగఁ
దిరుగుచుండెడుపగడంపుదీఁగెయనఁగఁ, బూవుదోటను వెలయునప్పొలతిగనియె.
క. కనియల్లనఁజెంగటికిం, జనికన్నుంగవనుమిగుల జాల్వాఱెడు నీ
టిని జెఱఁగునఁదుడుచుచుని, ట్లనియెన్ డెందంపుఁదమ్మినంటినకూర్మిన్. 116
సీ. "తలగామురాయందు తారసించిన నాఁటి నెలపొల్కి నెమ్మోము పాలుపుతఱుగఁ
బూఁదేనెనిండినపొందమ్ములోయనఁ గనుఁగవనీళులుగడలుకొనఁగ
నల్లనల్లనవ్రాలునల్లమబ్బోయనఁ జిన్ని వేనలివీడిజీరుకాడఁ
దనిగాలిఁగదలుచక్కనిపూవుఁదీవియ వడువున నెడ మేనవడఁకుగదుర
నొడలనుపదాఱువన్నెపసిండికరఁగి, కాలువలుగట్టెనోయనగడిరమయిన
చెమ్మటలుగ్రమ్మ; నీవిట్టులుమ్మలింపఁ, గతమదేమొకొ తెలుపుమాకలికిమిన్న.
చ. చెలువరొ! యొక్కరాచబలు సింగవుగాదిలిపట్టివీవు; నీ
పలుకులకీఱతాఱలుగఁ బల్కెడువారుపఱుళిక్క; కన్నుస
న్నలను మెలంగుచుండుదురునమ్మిచెలుల్; కతమేమివంతకున్!
గలతెఱఁగెల్లనాకిపుడు గ్రన్ననఁదెల్పవె; యేనులాఁతినే. 118
చ. చెలియరొ! తల్లిదండ్రులకుఁ జెప్పనికందువలయిన నాదుపొం
తలకరుదెంచి; తమ్ములపుఁ దావిగుబుల్కొనదండనిచ్చి; వీ
నులనిడుచుందువర్మిలి; ననుంగుఁజెలీ! యిపుడేమిదోసమున్
జలిపితిఁదెల్పకుండుటకుఁ; జానరొ! నన్నెడసేయఁబాడిరే" 119
చ. అనవుడు రాచకూఁతురెదయందలికొందలపాఁగియిట్లనున్
"వినుమొకగొప్పముప్పాదవె; వేసటకోర్చిచిపిన్న నాఁటి చె

ల్మినిమదినెంచినీవుతగు మేలొకఁడివ్వఁడొనర్చితేనిద
ప్పను జెలికాఁడ!" నాఁజిగురుబోఁణికినద్దొరబిడ్డఁడిట్లనున్. 120

చ. అడిగినఁబొందిఁగల్గునసుమైనను గొంకక చేనిడంగ; నీ
యుడిగమునుబంటుచందమున నోరిమిమైననయంబుసల్ప; ది
ట్టఁడనయియేనునిల్వఁగనెడందను గొందలమంద నేల? నో
పఁడఁతిరో; గారనెక్కిచిఱు పంచలఁదూఱెడుదానిచాడ్పునన్. 121

చ. తడయక తెల్పు; చేయఁదగు దానిని జేసెదఁ; గాలుచిచ్చునన్
బడుమనికోరినం బడెదఁ; బట్టెదసింగపుగున్న నేనియున్;
గడలినిమాఁకుమన్న నిచె గ్రక్కునదూఁకెదఁ; బాపఁడేని బ
ల్పడగలనున్న మానికము లంగొని తెమ్మనఁబోయి తెచ్చెదన్" 122

క. అనవుడురాకన్నియమని, వనటందిగఁద్రావిలోనవఱలెడివలపున్
గనుఁగవవెలిఁబుచ్చుచుని, ట్లనియెన్ దళవాయిబిడ్డ కారడమొదవన్. 123

క. "కలఁడొకయల్లుఁడు నామా, ర్తలికాతఁడు మొఱఁకు; తులువ తనపుఁబనులకుం
బలియుఁడు; కల్లలకిలు; దొం, గలకొజ్జలు; జూదగాఁడు; కట్టిండిసుమీ. 124

క. పొట్టతెగఁగోసిచూచినఁ; గట్టా! యక్కరముసున్న; గడితపుదివ్వెన్
బెట్టివెదకించినను బొడ, కట్టకుఁ గుంతెనఁ జెలివిగాదిలిసకుఁడా! 125

సీ. ఇనుపగజ్జెలతల్లి యెలమిఁ జిందులుద్రొక్కు వెడఁదయౌ నెమ్మోము నడుమనెపుడు
అగ్గిగుండంబుల నెగ్గులాడెడు కన్నుఁగవ చంద్రనిప్పుకల్ గ్రక్కుచుండుఁ
బెనుతాడిచందానఁ జెరిగిననెమ్మేను పూచినబూరుగుపోల్కిఁ దనరుఁ
జిఱ్ఱువెంద్రుకలొప్పుసిరమును బొడగన్న బూతాలఱేఁడను బుద్ధిపొడముఁ
బాయమారయ నలువది పైని రెండు, కాల్చిపరికించినను లేదు కనికరంబు
కోడిగంబాడు గానములఁ గొండమన్కి, నడవిమెగమైన మంచిదా చెడుగుకన్న.

ఆ. పేరుచంద్రవర్మ; పెద్దలుచీమకై, పడిగడించినట్టి పైకమెల్ల
జెలవెలందుకలను వెచ్చించి జోగియై, కూడులేక యిప్పుడుకుందుచుండె. 127

చ. మడుఁగునుబోలువంగసము మైలయొనర్చి; కొల్లంబువారిలోఁ
గడుతలవంపులంబడె; చౌకాటపుఁగీరితివీటిఁబుచ్చి; యొ
డ్డడివెతఁగన్నవారలను దప్పకవేఁడుచుఁ; బ్రొద్దులెట్టులో
కడపుచునున్నవాఁడతఁడు గాటపునెవ్వగనానగండయై. 128

ఆ. వానిఁదెచ్చియొక్కమానిసిఁగావించి, పేర్మినన్నొసంగిపెండ్లిచేసి
యతనిపేరఁబుడమినంతయుఁదానేల, దలఁచెసవతితల్లితండ్రిపిదప. 129

వ. ఇట్లు తలఁచి నిన్న నాచెన్నఁటింబిలిపించి యొన్నెన్నియో రాచిన్నెలుతిన్నపఱచి నాకన్నతండ్రియగుమన్ను తేఁడుతనపోఁగునందగులుకొనినవాఁడగుటంజేసి యాతని చెంతకుంగొంపోయి యాకట్టిడింగట్టెముట నిలుచునట్టుకట్టొనరించి జగజెట్టియని యు; జెట్టిదపుజివ్వల నెట్టిడులనైన బొట్టక్రొవ్వుమట్టుపెట్టి చాపకట్టుగాబడఁగొట్టజాలినదిట్టయనియు; బుట్టని బొట్టియలకు బేళ్లువెట్టి; చీమనమజేగ పుట్టించి; గోరంతలు కొండంతలుచేసి; మాటల తేటలఁబంజిళ్లువెట్టి; నోరఱుగ నేమేమియో నూఱి చెవికెగఁబోసి యాముసలి బడుగుమీఁద మిక్కుటపుటక్కటికము నెక్కొనంజేసెనంత. 130

సీ. గట్టుమన్నికిసీసకంబుపెట్టినయటు గుడిసెకుమేల్కట్టుగూర్చినటు
బొండుమల్లెసరంబుబోడికినిడినట్లు కాకిముక్కునకెంపుగట్టినట్లు
మసిగుడ్డలోపలమానికంబిడినట్లు సలుగుమేననుగంధమలఁదినట్లు
వెండిపల్లముఁదెచ్చివేఁపిపైనిడినట్లు ముసుకచీరనుజరీయునికినట్లు
పిల్లిసిరమునబలుదివ్వెపెట్టినట్లు, తండ్రినామాలుతల్లిబోదనలనమ్మి
పరువుమాలినయాచంద్రవర్మకిపుడు, కట్టిపెట్టఁదలంచెసంగాతకాఁడ! 131

గీ. ఆలివలఁజిక్కియున్ననాయనుఁగుఁదండ్రి, కిడితగదటంచునుడువువారెవరు! నేనె
నుడువదొరఁకొన్నచోఁదనపడఁతిపలుకె, పాటినేయునుగానినామాటవినఁడు.

ఉ. కావుననట్టిబెట్టిదపుఁగాఁతియపుట్టకమున్న నామమేల్
తోఁపువనునీవుఁజెల్పఁదగుతొయ్యలులెవ్వరులేమిఁజేసి నే

నేవినిపింపఁ గావలసె; నిక్కము డాఁపఁగ నేల? నీపయిన్
నావల పెల్లఁ జిక్కె; నిఁక నన్నుఁ దమిం దరిఁ జేర్చి ప్రోవవే. 133

సీ. చెలిమిఁ గాడవు నీవ; చెలిమికత్తియ వీవ; వెలలేని నాపాలి వేల్పు వీవ;
యారాటములఁ దీర్చునట్టి సామివి నీవ; దొరలేని యనుఁగు బంధుగుఁడ వీవ;
యెలమి కన్నవ్వల కిచ్చు క్రొన్నెల వీవ; తలఁపుఁ దమ్మికి వేఁడివెలుఁగు నీవ;
పెనుకోర్కెల నొసంగు పెట్టుఁ జెట్టవు నీవ; బలుపున్నియంబుల సామి వీవ;
యెల్లజగములు నీవ; నాయుల్ల మీవ, వెలియు సులు నీవ యెదఁగల్గు వేడ్క నీవ
పలుపలుకు లేల? నమ్ము నా బ్రతుకు నీవ, మదిముసుఁగు వెట్ట నేల? నామరుఁడ వీవ.

క. నినుఁ గాని యట్టులుండిన, ననురమ్మని చేరఁ దిగిచి నాకడఁగండ్ల
ల్లను బాపువార లెవ్వరొ, వినిపింపవె నాదుపాలి విరివింటిదొరా! 135

చ. దురమున నిల్చి మాతురగరత్నము ద్రుంచి; యొడల్ విగ నాడనీసుతం
డ్రిరహిని నాదుతండ్రికిని డెస్సెయి; నీవును నన్ను నేఁచిన
వ్విరివిలుకానిఁ దోలి; మెయి వేయొసఁగంగదె; యిట్టు కానిచో
వెరవిఁక లేదు సూ; మఱుని వేఁడిమి వాపి కొసంగ నెచ్చెలీ! 136

ఉ. చిన్నటనాఁట నుండి మన చేసిన నేస్తపు బల్మి నిట్టు సి
గ్గన్నది మాని; తెంపు మెయి నాడిన మాట మఱొక్క మాడ్కి గా
నెన్నఁగ బోఁకుమీ యెడఁద; నీయెలపాయమ దెల్ల నీకు నే
జన్నియ పట్టితి స్మరుఁడె సాకికి మాటలు వేయు నేటికిన్ 137

ఉ. ఇందులకీ వొడంబడక యిట్టటులాడితివేని దేఁకువన్
బొందియ నిప్పడే కటిక పూవిలుదాలుపు పాలు చేసి; నీ
పొందును బొందు దారినిఁక ముందటి బాముల నైనఁ గాంచి; నా
డెందములోని కొందలము డిందని నుందమిఁ గేలువట్టెదన్" 138

ఆ. అనుడు విజయసారుఁ డబ్బురమందుచుఁ, బొలఁతి తెగువ మదిని బొగడి; యామె
వలపు తీఁగ గట్టి పరికింపఁ దలపోసి, యిట్టులనియెఁ గూర్మి యుట్టిపడఁగ 139

ఉ. "వింటిమి నేఁడు నీవలన వింతలు క్రొత్తలు; చాలుఁ జాలు వా
ల్గంటిరో! రిత్త నెంజిలిఁ గలంగుట పాడియె తెల్వి మాలి నీ
పంటి వలంతి; యింటఁ గల వానిని వీసర పుచ్చి మేటి రా
దంటలు పల్వురుండఁ గను దండను జేతురె పేదనొక్కనిన్? 140

ఉ. సింగపుఁ గన్నియుం గొనఁగ సింగపురాయని కొప్పఁ గాక రే
నుంగున కెట్టులొప్పెడు ననుంగుఁ జెలీ! మది బీఱువాఱుటన్
వెంగలివాచుఁ దోఁచినది వేమఱు నాడుచు నుంటి వంతలో
నంగడ ముట్టు నేతలఁపు నంగలకోరిక లెల్లఁ? దొయ్యలీ! 141

సీ. అలరుఁ గ్రొంబూవుతావులఁ జల్లు చెవ్వాని యసమ ముజ్జగముల నలమి కొనియె
మలవిల్తుకంటిమంటల నవ్వు చెవ్వాని దినుసు మీఱిన తేజు దెసలఁ గ్రమ్మ
గలనమాతుఱ రకుత్తికలఁ ద్రెంచు చెవ్వాని వాలు మేల్ డాలునఁ గ్రాలుచుండెఁ
గనువిప్పదోరఁ గోడిగంబాడు చెవ్వాని యొడమి నిశ్వేదల నోముచుండెఁ
నట్టి నెఱరాచజాబిలి కనుఁగుఁబట్టి, వకటకట! పోలుపొందెఱుంగక కరంబు
పేదతనమున వెతఁ బొందు వెడఁగు నన్నుఁ, గేలుపట్టిన సెకేమి మేలు గలుగు? 142

సీ. నీయయ్యకొలువులో నెలఁతలతలమానికమ్మ రమ్మను పెంపు వమ్మువోవ
నిలువేల్పుగా నిన్ను నెంచి కొల్చుచునున్న చెలిమి బోటుల మోము చిన్నవోవ
నెల్లవారలు నిన్ను నేలికకఱచేతి నిమ్మపండను మాట నీటఁ గలయఁ
గసటెఱుంగని నీదు కడిది వంగసమను మడుఁగుఁ బుట్టమునకు మైలసోఁక
బందుగులలోనఁ దలవంపు గ్రందుకొనఁగఁ, బదుగురును గాంచి నవ్వి నప్పటలు గొట్ట
నూడులందఱు బ్రేలెత్తి చూపనకట!, పేదనను బెండ్లియాడిన లేదు మేలు. 143

ఆ. చమురు లేని దివియచందానఁ జక్కఁగా, నీకు నాకుఁ జెలిమి నివ్వటిలదు
నీటఁ గంచరములు నేలఁ గలంబులు, నడుచుటరిది గాదె పడఁతిమిన్న. 144

చ. ఎనమటిలేని నెయ్యమున కెద్దడితోఁ బగవాని కైవడిన్
పనటలఁ బెట్టి; నిల్కడను బాపి; దురాసను బెంచి; నెమ్మదిన్

దనగెడు తేఁకువంటిమి; తాలిమిఁ దూలిచి; దానితావునన్
గినుకనునిల్పఁ; బిమ్మటను గీడులు పెక్కొదవు న్వెలందిరో! 145

చ. వగలకుఁ గాపురంబు; పగవారలఁ దాఁ గలిపింపఁ దోడు; బం
ధుగులకుఁ గిన్క; నేస్తులకుఁ దోడ్పడలేనికడిందివంత; యా
ల్మగలకుఁ గల్గు పెన్మరులు మాపెడు బెబ్బులి; తెల్విదివ్వె పె
ద్దగ నొనరించు తెమ్మెరగ దానిఁ బేదఱికంబు పైడలీ! 146

సీ. కలమాటనుడివినఁ గల్లగా నెంతురు చెలికాండ్రు పిలిచినఁ బలుకరుఁగ్రు
తనవారిలోపలఁ దలవంపు తలకూడు నిల్లాలు మాఱుమోమిడును గినుకఁ
గడగండ్లు విడువక కాపురం బొనరించు మేలుగోనంబులే మెఱయకుండు
నొరులు చేసిన తప్పులొక్కట తలఁ బడుఁ జెడుగోనంబులు వచ్చిచేరు నెడఁద
నాఁకటికి నడ్డుపడువారు; చీఁకటికిని, దోడుపడువారలేవంక దొరకరుఁగ్రు
గొప్పవారలకడకేఁగఁ గొంకువొడము, లేమికెనయగు వెతమతిలేదు పుడమి. 147

క. తలిదండ్రుల పేర్మిముడిక్కెన్, వెలియై నాబోఁటికటికి పేదను దమిఁ బెం
డిలియాడి యక్కటక్కట;, పొలఁతీ! నీవేమి మేలు పొందెదొ చెపుమా. 148

గీ. ముందుగా లేవడిని వెతలొంది పిదప, సిరులవలన నుసుగములఁ జెందవచ్చుఁ
గాని ముందుగఁ గలుములఁ గాంచి పిదపఁ, బేదఱిక మొందు టెంతయు వెక్కసంబు.

గీ. కాననీ వెఱ్ఱితలఁపులు కట్టిపెట్టి, బలిమిఁ గలుములఁ జెలఁగురా నెలకొమారు
నొక్కరుని నీకు నచ్చిన చక్కనిదొర, వెలఁదిరో! కేలుపట్టుమా వేడ్క" ననుడు.

సీ. చెవినతటిని వెల్వెలవాఱు నెఱనూడ్కి ననుమోమునను విన్నఁదనము దనరఁ
దమ్మలఁ గ్రొందేనె త్రావి వెల్వడు తేంట్ల కరణిఁ గాటుకనీరు కనుల జాఱ
వలపుగుబ్బలిపూఁదివడ గాలివడువున ముకుఁగ్రోళ్ళ నిట్టూరుపులు చెలంగ
వెన్నెల ఱేనిపైకొన్న చీఁకటులన మోమున నెఱికురుల్ ముసురుకొనఁగఁ
జెమ్మరవడంపు విరజాజితీఁగెపోల్కిఁ, గదలికలు బంగరపు మేనఁ గడలుకొనఁగ
బుఱుకుపులుకు నదళవాయి బుడుతఁ గాంచి, యీగెలుంగున నక్కొమ్మ యిట్టులనియె.

క. "తొలకరిమొయిలుపుండీవల, వలెఁగలుములునిముసమునవచ్చుంబోవుం
జెలికాఁడ! వానిఁదిరమని, తలఁచుటకన్నను వెఱంగుఁదనమున్నదియే. 152

గీ. తుల్వకేన్మంచియదనునఁగలుగుసిరులు, కానితతిమంచివారికేఁగలుగకుండుఁ
గలిమియుప్పొంగి; లేమికిఁగ్రుఁతనొందఁ, దగదటందురుచదువరుల్ జగమగండ!

చ. కొలలవుఁద్రోవఁజూపుఁ; జెడుకోరికలన్మదిఁజొన్ప; నిచ్చలి
చ్ఛలుగరువంబురేఁపుఁ; గొనసాగఁగనీయకబత్తిమాపుఁ; బె
ద్దలయెడనమ్మకంబుఁగడుఁదవ్వగఁజోపు; నెఱంచఁబున్నెపు
న్వలనికిఁబావుఁ; గల్మిచెలివాఁడిమగంటిమిఁజూపినెయ్యుఁడా! 254

చ. కనుఁగవకింపుగానిమరఁగల్గఁగనీయదు; పెంచునాసలన్;
గనుపడనీదుపెద్దలను; గల్గలకిల్లానరించునెమ్మదిం;
బొనరుచులేనిశ్రద్ధితనమున్ జెవుడున్మొయిదారికక్కటా!
వినుసిరిచానకర్జములువింతలుగావెయునుంగునెయ్యుఁడా! 155

ఉత్సాహ. తెలివిమాలినట్టివానిఁదెల్విగల్గువానిగాఁ
గొలముతేనివానినుంచికొలముగల్గువానిగా
బలిమిలేనివానిగొప్పబల్మిగల్గువానిగాఁ
గలిమిచేసెసల్పుచుండుఁగాదెచిట్టకంబుగాన్. 156

చ. వెలచిగురాకుబోఁడివలెవెక్కసపుంబలుబూటకంబులన్
జలిపికడిందికొందలపుసంద్రమునంబడవైచిపోవుని
కలిమివెలందుకన్సతముగానెఱనమ్మెడువానికన్నవెం
గలియొకఁడుండునా! పుడమిగట్టిగనారసిమాడుమాటదిన్. 157

ఆ. సిరులుహెచ్చునేనిఁజిక్కులుహెచ్చును, సిరులుహెచ్చకున్నఁజిక్కుసున్న
సిరులుగలిగియుండెనేమంబొ! లేసంటె, నేమమో! తలంపుతెలిసికొనఁడ!" 158

క. అనిపలికి "సంగడీఁడా, విను" మనిమఱియిట్టులనియెఁ "బేదఱికమున సం
దునుమానుసులకునరసినఁ, గనుపట్టుంగొన్నికొన్నిగడితఘుసుకముల్. 159

సీ. బలితంపులోనిదాయల పెంపునడఁగించుఁ గడుపున్నియపుదారిగానిపించు
దయ్యంబునయంబుఁదలఁగట్టొనరించు సెనలేనికనికరంబెడఁదనించు
దురుసుపల్కులునాల్కతుదఁజేర్పనదలించు నోర్మిఁగల్గెడుమేళ్ళనుగ్గడించు
గరువంపుబలుబూచిఁగడలకుమఱలించుఁ జెలిసినవారిపొంతలకుఁబంచు
విందులందుమిగుల పేరిమివెలయించుఁ, దలఁపునకునుజాలఁదనివిఁబెంచు
సేవగింపఁదగునె లేవడిమనకిన్ని, సుగములొసఁగుచుండజగమగండ! 160

ఆ. మగలవెంట నేగిమగువలూడిగములఁ, జలిపిమిగులసంతసంబుఁగూర్చి
గరితతనమునెల్లఁగాన్పించినెగడుట, పేదతనమునందుఁగాదెసఖుఁడ! 161

సీ. పరఁటిపుట్టుగునిరోబారిక్రొల్గంటిక్రొత్తడితనంబడరెనెద్దడినకాదె
బొంకెఱుంగని జేనిముద్దుటిల్లాలిక్రొత్తడితనంబడరెనెద్దడినకాదె
వరుసతేరుల జేనిపట్టివాల్గంటిక్రొత్తడితనంబడరెనెద్దడినకాదె
నలుఁడనురారాచతలకట్టువెలఁదిక్రొత్తడితనంబడరెనెద్దడినకాదె
పాండుఁడనెడు జేనిపట్లనెలంతక్రొ, త్తడితనంబు పేదతనమునంద
కాదెయుడరెనట్లు కావునలేవడిఁ, జెలిమిచెడునటంచుఁదలఁపవలదు. 162

క. బలువిడినెద్దడియనులె, క్కలికాఁడొకతఱిని జెలిమిఁ గలిమిని దాడోం
గిలి నేనిమరుఁడుమనసు, న్గెలుపొసఁగంగలఁడు వాని గీటడఁచివెసన్. 163

ఆ. చిన్ననాఁటనుండి కస్సారనీకొనం, బులనుగాంచివలచిమున్నె నాదు
మదియొసంగియుంటి; మఱియిప్పుడీయెడల్, గూడనొసఁగుదానఁగొనవెయమఁగ.

గీ. మరులనువరాలగనిమనమదులయందు, పొదుకొనియుండఁ బేదలమౌదుమెట్లు?
నీవుకాపురమనిమెడి నేల నేలు, నొడయుఁడవుకమ్మరాణినైయుందు నేను. 135

సీ. నిక్కంబుదప్పని నేల జేఁడవునీవయతనియాలనుచంద్రమతిని నేన
పదితేర్లయెకిమీని మొదటికంసవనీవచాలు పేరింటిప్రోయాల నేన
మిన్నెఱుతలఁదాల్చుమేటిదేవరనీవగట్టులదొరముద్దుపట్టి నేన
విరవింటిదొరఁగన్నవేల్పుసామివినీవ పాలేటిగారాబుబట్టి నేన

చిలుకతత్తడి నెక్కెడుఁ జియ్యవీవ, యతనికింగడుఁ గూర్చెడు రతిని నేన
యనితలంచుచు నెమ్మదిఁ దనివిఁ బొంది, కాపురము చేసికొందమక్క యలుదీఱ. 166

చ. తనచెలిమాట తండ్రిజవదాటక యుండుట; మాఱుతల్లిన
న్నన యముఁ జంద్రవర్మయను నాతనికీయఁ దలంచుచుంటయున్;
గనిన నెలంత వోవుటయుఁ; గాంచియు దందిగు లోర్చికొంటిని
న్ననుగొని; దయ్యమన్నిటికిఁ గన్పతి చెన్నినునంచుఁ బొంగితిన్. 167

గీ. అట్టియఱలేని నావల నడవిపాలు, సేయకేలుము; తమినీదు చెట్టవట్టి
నేను పడరాని యిడుమలే నీవుఁ గాను, బొందుదాననుసంతోసముగనుసకుఁడ! ” 168

ఆ. అనుడు విజయసారుఁ డాయింతికిట్లనుఁ, “జిచ్చులేక మండు మచ్చరీఁడు
నీదు తండ్రి వినినె నెనరేదియప్పడ; వెడల నడచు నన్ను వీటినుండి. 169

గీ. పొలఁతిరో! నిన్ను నొకరాచబొబ్బ మెకపు, గున్నగీయంగఁ దలఁచుచున్న తండ్రి
చెవులకొకకూటి షేదను జెట్టపట్టి, నట్టిమాటలు సూదులై యడరకున్నె. 170

గీ. అగ్గికిని గాలి బాసటయైనయట్లు, తండ్రికినుక నుపీ మాఱుతల్లి రేఁప
నొడలు తెలియక యతఁడెట్టి చెడుగొనర్చు, దెగువ పేయుఁడు? తెల్పుమా తెఱవ మిన్న.

గీ. చెలియ! యెత్తువారి చేతిబిడ్డండు నీ, కన్నతండ్రి; యతనికతలు నీవు
నాడువింతలటవె; నాతిరో! యిదివిన్న, మండిపడుచు మనలఁ జెండకున్నె. 172

గీ. కుడిచికూర్చుండఁ జాలక గోడవయ్యొకట్టి, మీఁదనిడుకొనుటింతయు మేలుగాదు
కానసీజతనములింక కట్టిపెట్టి, మంచి తెరువునుబట్టుమా మగువ!” యనుడు. 173

సీ. కలికి కొప్పున నొప్పు కన్నె గేదఁగులతో విరజాజి పూఁదావి వియ్యమంద
నెమ్మోము పైనిడ్డ నెలవంక బొట్టుతో జింక పొక్కిలి చాలఁ జెలిమిసలుపఁ
బరువంపుజలువ కప్పురముతోఁ దములంపు వలపులు గోడిగంబులనొనర్చ
నలుతను దాల్చిన యాణిముత్తెములతో ఘానికంపు సరాలు మాఱుమలయఁ
బలు మెఱుంగులు చిఱునవ్వుఁ గలపి షొలయ, ముక్కుముంగర కెమ్మోవి ముద్దులాడ
విజయసారునకిట్లను వెలఁది మిన్న, పలుకు పలుకున దేనియల్ లొలుకుచుండ. 174

చ. "అలుకను నాదు తండ్రి నిను నక్కటికంబుతొరంగిపొమ్మనన్
చెలువుఁడ! వెంటవచ్చెదను; జెందెద నేనును బాలికత్తెనై
యలజడులైనను౯ సుగములైనను హాళిని నిన్నుఁ గూడి; నీ
కెలమిని గూర్చుచుండెదను నిక్కటులొక్కట చుట్టుముట్టినన్. 175
చ. బిడలనువంచి పాటుపడి పోరిని మైఁబగ లెల్ల; మాఫలన్
బడలికతీఱ మున్కలిడి పమ్మిన వేడుకనున్నమట్టుకే
కుడుచుచు; నెట్టిచిక్కులకుఁ గొంకక సైచుచు; నాకుటిండ్లసొం
పడరఁగ నుందమాల్యగలహాళియి దేయన్ని మెచ్చనంధలున్. 176
ఉ. కూరిమి నీ వెలందియడుగుల్ దమి నెత్తుచు; నీదు నెమ్మనం
జేరినవంతలందొలఁచి; సేగులు నా బలుముండ్లనన్నిటిన్
నేరుపుమీఱఁ జెండఁగనె నిక్కపుఁ గాపురపున్నగంబుల
య్యారె! యివే యటంచుమది నారడమందఁగవచ్చు నత్తఱిన్. 177
చ. మనకిలు వేలుపొంచిలుక మావువ జీరుని మెట్టదమ్ములే
యనయము నమ్మి కాపురము హాళినొనర్చుచుఁ; గమ్మి పెంపుసం
గనులను గానకుండఁ పలుగాకుల సుద్దులసెంచి నవ్వుచున్;
దనివిని బొందిప్రొద్దులను దాలిమిఁబుత్తమనుంగు నెచ్చెలీ! 178
ఆ. ఇదుమలనినగరువపడుచు నేలనుగల్గు, చెడుగు వేడుకలనువిడిచి కలిమి
చెలువవలనఁగలుగు సిలుగులఁ దలపోసి, కొనుచుఁ బ్రొద్దుపుచ్చుకొందముఁ నుగ! 179
క. మరుల నెడుదివియఁ జెలిమిచ, మురుననునెక్కొనగఁ జేసి మొగ్గలమగు పె
న్నెరసుల నునిరులనన్నిటిఁ, దొరఁగింపఁగవచ్చు" ననుడు దొరబిడ్డఁడనున్. 180
ఆ. "లేమ! లేమి నేమిలేమిని హెచ్చుఁజి, రావు; దానివలనవీఁక చెడును
వీఁక చెడినయంత ఖేదరుముదిరిని, స్నేమనందునొక్కయెఱుఁగరాదు. 181
గీ. అట్టియెడ నీవు సైరణయడఁచిపుచ్చి, యిపుడు చేసిన కర్జంబున పుడుతలఁచి
వనట నొందఁగవలసివచ్చును నెలంత, కాన నాపల్కువిని తెంపుమాను" మనుడు,

సీ. సుద్దంపునునుఁ జెక్కుటద్దంపుదోయిపైఁ జిఱునవ్వువెన్నెలల్ జిగులునింప
వలఱేనితూపుల గెలుచువాల్జూపుల కొనలు క్రొమ్మించులఁ గ్రుమ్మరింపఁ
బసమించు నెమ్మేనివలపులెల్లెడఁ గ్రమ్మి కోనను గందంపుఁ గోనసలుప
విరజాజినెత్తావి వెదచల్లు నెఱికురుల్ తేఁటిజోటులపాటపాడ
ముంగర మెఱుంగుఁ జగురుకెమ్మోవిరంగుఁ, గలసియొండొంటితోడను జెలిమిసేయ
నక్కళావతి దళవాయియనుఁగునిసుఁగుఁ; గాంచియిట్లను నెయ్యంబుగడలుకొనఁగ.

సీ. "చిన్నారితియ్యనుంగులఁ జిలుగ జడ్డియలుఁ బ్రమోయ నేనుంగునడకల నేగుదెంచి
కమ్మనిమైతావి కడలకుమలయంగ నల్లనల్లనఁ బైఁటనలవరించి
కరువలిఁ గదలుచక్కనిమల్లెపూఁదీవ చెలువునఁ బజ్జలఁ జేరినిలిచి
కన్నుంగవనుఁ జెల్మికత్తెయాచిఱునవ్వు పొలయంగఁ దీయనుపలుకుపలికి
నీకుగలిగినయట్టి చిరాకుసడఁచి, యలుకవోకార్చియోరిమిగలుగఁ జేసి
సుగములాడఁగూర్పఁ దగినట్టిమగువయోర్తు, బాసటగనుండవలదెయప్పట్టునందు.

క. ఎద్దడిఁ గలిగెడువనటల, గ్రద్దనఁ గడవంగఁ బెట్టఁగా నేర్పుమెయిన్
సుద్దులను దెల్పినీమది, దిద్దం దగువిందులేక తెలఁగట్టుపడున్. 185

గీ. కూటికిని బేదవై నను గొలమునందు, నీవుసుంతైనఁ బేదవు కావు; కానఁ
గవికరంబున నీపాటిచను వొసంగి, పున్నియముకట్టుకొనఁక దేవ న్నెకాఁడ!" 186

ఆ. అనుడు విజయసారుఁ డలఁతినవ్వొక్కింత, కన్నుదమ్ములందుఁ గడలుకొనఁగ
నిట్టులనియె రాచబొట్టియఁ బోఁడగని, తలపులోనివలపు తెలివిరియఁగ. 187

చ. "నెలతరో! నీమదిం గలుగు నిక్కువమారయఁ గోరి; యింతగాఁ
బలికితి గాక; నీపయిని బాళినిపీడిమనంగ నేర్తునే
తలఁపులరెంటినొక్కటిగఁ దానొదరించెను మున్నె మల్లెపూ
విలుతుఁడు; జంపుసేయకిఁక వేయుడిగంబునకౌనవెట్టవే" 188

వ. అనుడు నయ్యింతియు నింతంతనరాని సంతసంపు వేలుపుజాలువ నోలలాడి యప్ప
డవాలుబుడుత నిరుచెవియెఱుఁగకుండ విరివిలు దొరయొజ్జగా వలపుటింగలమెల
గాఁ బెండ్లియాడె.

ఉ. కోరికలీసడించి పెను కోనలబత్తినిజల్పు మేల్నిరా
ఘారులయుల్లమందెపుడు పాయకనిల్చెడి మేటి వేలుపా!
తోరపుఁగిన్కమీఱఁగనుద్దంతహుమాదొరఁ గ్రుంచి; బాసవాల్
కూరిమిఁబుట్టసన్నగముఁగూర్చిన వేలుపువాఁకతాలుపా. 190

క, నగమన్నన్ సిగమిన్నన్, నగకన్నుంగలిగినట్టిజేజేరాయా!
తెగకొట్టికలరాకాసుల, పొగరడచినదిట్ట! వేలుపులతలకట్టా! 101

క. నెలప్రొద్దును నేలయునిం, గలమును గేస్తుండు నీరుగాడుపుమినుగా
పులుగాఁగలయొడయఁడ! మరుఁ, బొలియించినప్రోడ! కడిఁదిబూచులఱేఁడా!

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర కౌశికసగోత్ర పవిత్ర జయంతికులకల
శార్ణవరాకాకైరవమిత్త్ర భావనారాయణ పౌత్త్ర రామనార్య పుత్త్ర
వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల శ్రీమదాకుండి వ్యాసమూర్తి
దేశిక పదసేవాపరాయణ భావనారాయణ ప్రణీతం
బయిన కళావతీ పరిణయంబను శుద్ధాంధ్రప్రబం
ధంబునందుఁ బ్రథమాశ్వాసము.
శ్రీభీమలింగార్పణమస్తు.

---

శ్రీరస్తు.

శ్రీభీమలింగాయనమః.

# కళావతీపరిణయము.

## శుద్ధాంధ్రము.

## ద్వితీయాశ్వాసము.

క. సిరులొసఁగెడువలిగుబ్బలి, దొరబొట్టియుఁగూడివేల్పుదొరయుంగటిదే
వరయుంగొలువఁగనలరెడు, సరిమీఱిన ఱేఁడ! వంతసంద్రపుటోడా! 1

వ. అటమీఁది కత తెలుంగాలకింపుఁడు. 2

ఆ. అట్లు పెండ్లినూడి యలరునుదావియుఁ, బలెనుగలసి మెలసి పలుసుకములఁ
గాంచుచాలుమగలుకాపురంబొనరించు, చుండిరెదలవేడ్కనిండుకొనఁగ. 3

సీ. ఒకనాఁడు తేనియలొలుకఁదీయనిముద్దు పలుకులనలరించుఁజెలిమికాని
నొకనాఁడుమిగులవేడుకమీఱవీణియ మీటిమెప్పించునునీటుకాని
నొకనాఁడుబలుచవులూరఁగూరిచికబ్బమునబలే! యనిపించునసుపుకాని
నొకనాఁడుచిత్తరువుసుఖవోసినయట్లు వ్రాసిహాళిఁదనర్చువలపుకాని
నొక్కనాఁడర్మిలియెడంప నెక్కొనంగ, విరివిలువజీరుపొత్తంబువిప్పిచదివి
వింతపడునట్లొనర్చువేడ్కకాని, రాచచాలులమొగపుగారొబుపట్టి. 4

గీ. అంతఁగొన్నాళ్ళకాఱేనియనుఁగుమగువ, వారియొనలేనికూరిమివలనఁగొంత
డెంపమునసందియంబునుబొంది; దాని, కలతెలుఁగారయఁగదాడికాండ్రననిచె. 5

ఆ. అనుపవారివపోయి యయ్యాళ్లుమగలకుఁ, గలిగినట్టికన్నెకలుపుమరులు
పొలఁకువలును; వారపొకలులెస్సగా, నెఱిఁగివచ్చిరాణికిట్టులనిరి. 6

గీ. "తల్లిరో! నీవుతలఁచినతలఁపునకును, వేఱువితమేలకలుగును? విజయసారు
నక్కళావతికేల్వట్టెనిక్కువముగఁ, గాంచివచ్చితిమమ్మ మాకన్నులార. 7
సీ. విరజాజిక్రొజ్జంగివిరులదండలతోడఁ దడఁబాటుగల్గునెన్నడలతోడ
వీడితావులనీనువింతవేనలితోడఁ గడుఁబడలినయట్టియొడలితోడ
సొగసియుసొగయనిసోలవుచూపులతోడఁ నీటులుగులుకుజాఱుపైఁటతోడ
జిగిమించుకెమ్మోవిచిగురుకెంపులతోడ నిదురకన్నులఁ దేఱునిదురతోడ
మొన్ననద్దమరేయిఁ బూఁబొదనువిడిచి, వచ్చుచున్నట్టితమకళావతినిమేము
కాంచివచ్చితిమమ్మ మోకలికిమిన్న, నమ్మునిక్కమ్ము నీపాజ్జనమ్ములాన. 8
గీ. అప్పొదనువారుచెల్మిమైమెసలరుచుండి, మాటలాడెడుతఱినినీమాఱునిసుఁగు
విజయసారునిఁ బొడగనివింగడముగఁ, బలికినతెఱంగువినవమ్మపడఁతిమిన్న? 9
సీ. "వెలిఁబాలుకడుపునవిసముగల్గుపనంటి బలుపిల్లగప్పినపాడునూయి
మేకవన్నియఁ బూనిమెలఁగుచార్లమెకంబు తలగడమఱువునదాఁగుత్రాఁచు
చెప్పులలోపలఁ జేరినపాట్టియ చిన్నిపూఁదేనెపూసినకటారి
మగవరూపునుదాల్చిమసలెడురాకాసి కప్పుమెఱుంగునఁ గ్రాలుచిలువ
నీటఁజాడఁదీయునేర్పరి! పుట్టని, బొట్టియలఁపఁ జేల్లువెట్టుజంత
మాఱుతల్లి; యామెమనకందువెఱఁగిన; మిగులసేగవొడముసొగసుకాఁడు! 10
ఆ. కొనమరుఁ వెలికిఁ గాన్పింపకుండఁగ, మెలఁగుచుందమెలమిమిత్రదాసు
మనసునడుమకమ్మలనుజేరవైచును, జెలిమియిరువురంచుఁ గలిగియుంట. 11
సీ. ఎపుడైననతఁడుగాన్పింపకుండినవారి నీరిచేజాఱులం పెదవుసుమ్మ
చనువుగానెవ్వరైన నుమాటలాడిన మదిలోనిగుట్టుతెల్పెదవుసుమ్మ
కనువేదురెత్తి నేననినాదుసైరసే చెలిమిన్నవైనఁ బిల్చెదవుసుమ్మ
దారితప్పిమఱొక్కదానిని నేనున్న గీమెన్నఁడైనఁ ద్రొక్కెదవుసుమ్మ
తుంటవిల్తునికాఁకలమాలితూలి, కరముబడలికనొక్కింతకన్నుమోడ్చ
నచననన్నెంచికలవరించెదవుసుమ్మ, పదుగురుంచఁగఁదమినిజాఁచెదవుసుమ్మ. 12

క. మనపెండ్లికితనియెడఁ, దననాయుల్లంబునంతతక్కమఱొకచో
టనుసుబ్బకుండునట్టుల, పొనరింపవెపుడమి మెలఁగుపూవిలుకాఁడా! 13

క. తఱియరసి నాదుతండ్రికి, నెఱిగించెదనంతదనుక నెవ్విధమున నో
మఱవకవసైచిప్రొద్దులఁ, గొఱయొదవకయుండఁగడపికొనుమాసకుఁడా!” 14

క. అనిపలికి విజయసారుని, వెనువెంటందోడికొనుచు వెడలెనెచోటికో
కనుఁగొంటి మొక్కపాదమరు, గుననించుకనిల్చివారి కూరిమిపెంపున్.” 15

గీ. అనుడు దేవేరి మదినికట్టలుకగలిగె, యుండియుసుదానిబయలికినుబుకనీక
తలఁపునననిల్పికొని పసవనములోసఁగి, దాడికొండ్రకు సెలవిచ్చి తలఁచెనిట్లు.

ఉ. “అద్దిర! దీనిగుండెదిటవెంతటిదండ్రిని మక్కనేసి; నే
నొద్దనుగాపుగానిడిన యుగ్మలులంగెకరించియుక్కటా!
ముద్దులమూటగట్టుతన పొంకపుజవ్వనమొక్కపేదకున్
ముద్దియదారవోసెనటె ముందునువెన్కయుఁగానకింతయున్.

సీ. అల్లిబిల్లిగనిర్వురాటలాడెడునాఁడె తప్పని నేనొక్క చెప్పనైతిఁ
జనువులు నేర్పించునదనుననిదికడుఁ జెడుగని జనితోనుడువనైతిఁ
బూఁదోఁటకిరువురుఁబోయెడుతఱినైన మించుబోణినిమందలించనైతి
దొరలేనిచెల్మిపిడులవెంటవంటగా, వెడలమాన్పింపఁగఁగడఁగనైతి
నకట! నామాటకీఁగకాలంతరైయెన, నెదురుపల్కనిముగుదతానింతలోనె
యింతతెగువయొనర్చునంచెఱుఁగనైతి, నలఁప నేనొంతుఁ తలచెనుదయ్యమొంపు.

చ. అలుకొకయింతలేకననునక్కట! వాకొనరానికౌఱులం
బలుక తెగించెనట్టె; తనపాట్లుదలంపక పేదనొక్కనిన్
జెలిమిని గోలుపట్టెనటె చెప్పకయెవ్వరితోడ; నింక నేఁ
గలఁతలువెట్టుపన్నఁ జెడుఁ గిర్తములన్నియునొక్కపెట్టునన్. 19

ఆ. ముందుమిత్రదాసుమ్రందించిపిమ్మట, మున్నుజనితోడమాటలాడి
విజయసారుపీడ విడిపింపవలె” నంచుఁ, దనదుడెందమునను దలఁచె సతి. 20

ఆ. రాచవెజ్జునొకని రహిమీఱఁ బిలిపించి, యొకకడానిగద్దెను నిచి మంచి
పసిఁడితొడవులెన్నొ పసదనంబుగ నిచ్చి, యిట్టులనియెఁ గూర్మి యుట్టిపడఁగ. 21

క. "చెడుగు మెగంబులు పెనురా, యిడి సేయుచు నిదురపట్టనీయవు రేలన్;
మడియింపఁగ వానికి విస, మిడవలయుం గానఁ దెచ్చియీఁగదె సరగన్." 22

చ. అనవుడు దాని పోడుగొన మంతయు నాతఁ డెఱింగియుంటచేఁ
జిననుఁగొంత సేపుసుఱు తీఱినయట్టుల కానిపించుమం
దును వనసంచి విప్పియిడఁ దొయ్యలి గైకొని కట్టెఁ బైఁట చెం
గునఁ దటి వేచి యెట్లయినఁ గుంటెన కానినిజంపుకోరికన్. 23

గీ. అంత వేఁకియుఁ దలమేరునలమికొనుట, మిత్రదాసాక్కనాఁడెదమి కుఱ్ఱటంపు
టలజడిని బొందుచుండెనయ్యదనెఱింగి, వన్నెనచ్చటికా రాచమచ్చెకంటి. 24

ఆ. అరుగుదెంచి తేనియలు చిల్కపల్కులఁ, బలికి వెలికిఁ; దనదు పైఁట చెఱఁగు
నందుఁ గొ్రలుచున్న మందు ముల్లియ విప్పి, వానిచేతఁ బెట్టి పలికెనిట్లు. 25

సీ. "తలయేరుపేరి బెబ్బులికిం గలపుగుండు వేఁకిపాలింటి బల్తోఁక చుక్క
బాలింత తెగులను గాలికిఁ గఱిత్రాఁచు చలువనొప్పుల యేపు చంపునిప్పు
జన్నినాహుత్తి నిజకాఁడు సింగంబు వింతజవ్వనమిచ్చు వేల్పుబువ్వ
బడలికఁ దొలఁగించు పన్నీటిపెనుబావి పలుజబ్బులను జెండు బ్రతుకుమందు
దీనిపూన్నాళ్లు గైకొన్న మానునెట్టి, తెవుళులైననుఁ గొమ్మ" యీ తెఱవయొసఁగెఁ
గడిఁదికూరిమి బయలికిఁ గానిపింప, నోర! చెలియంత జంతరయో యరసి చూడ. 26

ఆ. మిత్రదాసుఁ డంత భ్రమింగ కదానిని, బదిలపఱిచెనొక్క బదరికమున
నొప్పతెవులుగలిగినప్పుడు గొనవచ్చు, ననితలంచి తెలియకా మెగుట్టు. 27

ఆ. అపుడు తొడుసువాసె ననియెంచి దొరసాని, పుడమిఱేని కడకుఁ బోయి యతని
గూడ నెఱిఁగి మాటలాడుచుఁ బల్కవెం, బడిన గూఢుఁ కతనుసుడి వెనిట్లు. 28

గీ. "కంటి గోకానకోతమకన్న నిసుఁగుఁ, బెండ్లియాడెనుఁ డనిఱు పేదవిజయ
సాదఁ డుడిగంబు బత్తిమైఁ జలుపవచ్చి, గీయునను సామియైనట్టులేమి చెప్ప. 29

క. నీకూఁడుగుడుచుచుండియు, నీకన్నియ మదిని చెఱిచెనీచు విలాఁతిన్
గైకొనఁదలంపఁబోలును, గాకుండిన నిట్లు సేయఁగడఁగునె ఱేఁడా! 30

సీ. దొరబిడ్డయడుగుఁదామరలకే గాని తా మ్రొక్కఁడు బలువేలుపునకునైన
దళవాయినిసుఁగునందమె కాని యిసుమంత కననొల్లఁడించువిల్కానినైనఁ
బడవాలుకొడుకుముద్దునుడువులనే కాని విననిచ్చగింపదు వీణనైనఁ
జేరువదొరబొట్టిచేఁతలనే కాని తలఁపడు చెలులాడుపలుకులైన
నేమిమందులువాసెనో; యేమిమంత్ర, రించెనో; గాని తెలియదు రేవగళ్ళు
లతనితోడిదజగమనియాలరుచుండు, మనకళావతియేమందుమన్న ఱేఁడ! 31

ఆ. వలచువారు లేరొ! వలపించువారలు, లేరొ? పుడమినడరులేమలందుఁ
గంటిమట వెయిట్టికతలుమున్నెపుడైనఁ, బ్రొద్దువంగడంపుబొబ్బమెకమ! 32

క. ఇలువడి చెడకుండఁగఁ, జుట్టలుగొట్టకయుండఁ జప్పటలు; తగువారల్
పలుమాఱు నవ్వకుండఁగఁ, నిలుపఁగదే పేరుపెంపు నేలయొడయఁడా!" 33

గీ. అనిపలుక నేయివోసినయగ్గిపగిదిఁ, గాలఁదాఁచినకత్రాఁచుకరణి ఱేఁడు
మండిపడి దండిబంటులఁ బిండుఁబిలిచి, పలికె నిట్లని కనులనింగలము గురియ. 34

ఆ. "బంటులార! నాదుపట్టికిఁ జెడుకఱ, దలను గఱపి మరులుకొలిపి దానిఁ
బెండ్లియాడినట్టివిజయసారునికిసం, కెలలువైచి తెండుకొలువునకును." 35

క. అనవుడు "వల్లే" యనుచుం, జనివారలు వెదకి విజయసారునికింగిం
కనుసంకలియలుదవిలిచి, కొనివచ్చిరి ఱేనిమ్రోలకుం జలము మెయిన్. 36

గీ. ఇట్టుగొని తేరమదినల్కపట్టలేక, కన్నుఁగవ నివ్వలురుల మొగమ్ము జేవు
రింప సెకకంటిపోలికఁ బెంపుమిగుల, నొడయఁడిట్లను దళవాయిబుడుతఁ గాంచి. 37

ఉ. "కట్టెఁడి! కండక్రొవ్వనను గన్నులుగానక నాదునెయ్యపుం
బట్టినిగల్లయిచ్చకపుఁ బల్కులఁ డక్కరించి దానికే
ల్వట్టితె? నీదుడెందమునఁ బాడిదలంపక డొంగమాడ్కిఁ; నీ
దిట్టతనంబు నీకివరుదిద్దిరిరా? పలుగాకికుఱ్ఱఁడా! 38

చ. తొలుతనుజీమకుట్టునొకొ దోమయెకుట్టునొయంచు వేయిక
న్నులఁగని పెంచినందుల కనుంగుఁగొమార్తెనెడొంగిలించినా
యెలమినినొరికొగరము నిచ్చినబల్కులకక్కటక్కటా!
పలుగుఁధనంబునంగయినె పండ్లనుజీలిచివైచినావురా? 39

ఆ. పెంచి పెద్దఁజేసి విద్దెలు నేర్పించి, నందులకును నాదుకందువునపఁ
జెడుగానంబులజ్బఁజేసితి; కుడిచెడు, కూడుకూలఁద్రోసికొంటి; తులువ! 40

ఆ. తల్లిదండ్రిలేనిపిల్లండనుచుజాలి, పడియెడంద నాదుకొడుకుపోల్కి
నరయుచుంటిఁగొంచెమైన నావిసువాస, ముంచవైతి; దోస మెంచవైతి. 41

క. మునుమీాయయపొరితమునఁ, బొనరించిన మేలుదలఁచి పొలియింప నెడం
దనుగొర్కి పొడమకున్నది, చెనఁటీ! యటుగాక యున్నఁజీల్పనెనిన్నున్. 42

గీ. నేను నాటిన చెట్టును నెనరుమదికి, మిక్కుటపు మెత్తఁదనమును నెక్కొనంగఁ
జేసినకతంబుననునిన్నుఁజెండుటకును, బొడమకున్నది తెగువ; కావుననువినుము.

గీ. నేఁటిసుతనీవునిముసమీా నేలనిలువఁ, గూడదట్టులనిల్చినఁగూల్చివైతు"
ననుమఁదలవాంచిదళవాయియునుఁగుబిడ్డఁ, జేమితోఁచక బాపడియెనుగలంత. 44

క. పడఁతుకమొత్తపుడాచెలి, కడకుంజనియామెతండ్రిగాటవుటలుకన్
బడవాల్ బుడుతకుఁజలిపిన, జెడిదపుటానతిని వెలుపబెగ్గిలివగతోన్. 45

సీ. తెలిబాజులీనుముత్తెపుమేల్జగిలెపైఁ జిఱుబొమ్మలకుఁబెండ్లిసేయవిడిచి
చిలుకబోదలకుమచ్చికమీాఱఁదినిపించుచున్న తీయనిపండ్లనుజ్జగించి
తలిరుజొంపంపుటందపుఁగుఱాళములఁబూ విలువజీరునివ్రాజసలుపుటుడిగి
పక్కిరాతాలయుప్పరిగబంగరుతూఁగుటుయ్యాల చెలులతోనూఁగమాని
కన్నుఁగవ వేఁడినీళ్లుఁగపలుకొనఁగఁ, జిన్నిపేనలిపొపునజీరులాడ
వినువిఱిగిమీాఁదఁబడ్డట్టువిన్నఁబాటు, దనరవచ్చెకళావతితండ్రికడకు. 46

వ. ఇట్లువచ్చి యమ్మచ్చెకంటి కన్నీరుమున్నీరుగాఁ బొఱఁ దండ్రియడుగు దమ్ముల
ఱాలి యిట్లనియె. 47

ఆ. "కన్నబిడ్డమీఁదఁ గనికరంబు నుబూన, కింత తెగువ సేయ నేలయయ్య;
యకట! లోనిదాయయగుకిన్క నడఁచియా, నెలవునం మనోర్మి నిలుపుమయ్య. 48

క. ఒరులు చెవిసూఁటి పోసిన, పరుసంబులు నమ్మి కన్నపట్టికి సెరగుల్
పొరయించి వెతలఁ బెట్టుట, పరువెఱిఁగినదొరకు నీకుఁ బాడియె తండ్రీ; 49

క. చిననాఁటనుండి యీతని, గొనములు గనుఁగొనుట చేసుగుడి యని చక్కం
దనములకుం గనియనియెడఁ, దను మేల్పడి యుండి యుండితె తండ్రీ! తుదపన్. 50

క. తలిరుజిరాదొరదాడికిఁ, బలువితములనోడి కేలు పట్టితిఁ జెఱవా
రలెఱుంగరు సూయీతని, వలనను దోసంబు లేమి పరికింపంగన్. 51

ఆ. కొనననున్నఁ జూచియైన నుగ్రారంపుఁ, గలననికని తండ్రి బలిమి నీవు
నుసులుఁ బొసఁగినట్టి విసువాస మైనను, దలఁచి కనికరింపఁ దగును తండ్రి!" 52

చ. అనవుడు కోఁడ మిక్కుటపు టల్కను గన్నుల నెఱ్ఱఁ జేసి "నే
నిను బలురాకొమారునకు నిమ్మని పెండ్లి యొనర్చి; యల్లవా
నిని మనయింట నేయునిచి నేలను నీకొసఁగంగ నెంచితిన్
జెనఁటిని జెట్టఁ బట్టితివె? సిగ్గఁదఁ బూనక నీవు కన్నకో! 53

ఆ. నిండుసిరుల నలరు నెఱరాచసింగముల్, పుడమి లెక్క లేక పొదలుచుండఁ
గుడువఁ గూడు; కట్టగుడ్డయు లేనిచె, న్నంటి నీ సదొరకె నా? మగండు?" 54

వ. అనినఁ గళావతి తండ్రి కిట్లనియె. 55

చ. "కడిఁదిసిరిం జెలంగు నొకకక్కసపుం బలురాచబాచికిం
బుడుత నొసంగి యుమ్మలికముం బిదపం బడుకంటెఁ జేపకిం
పడరు గొనంబులం దనరు నట్టియుటంకికిఁ బెండ్లి చేసినన్
బుడమి దొరా! యశంబు నినుఁ బొందదొ! పెద్దలు మెచ్చరో? మదిన్. 56

క. ఎనలేని కలిమి నలరెడు, నినుఁ బోలిన బల్లిదునకు నెఱిసల్లుండై
తనరెడు నితనికి నెద్దశి, తన మెక్కుడు నుండునయ్య? తండ్రీ! చెపుమా." 57

వ. అనిన రాజవాహనుం డిట్లనియె.

ఆ. "నీకు సవతితల్లి నిసుఁ జంద్రవర్మకుఁ, బెండ్లిసేయుమనుచుఁ బెక్కువగలఁ
దెలిపె నెలమి నామె పలుకుల కేనియ్య, కొంటి నిన్న; వాలుగంటి మిన్న! 59

క. మేమిరువురమిట్టులనీ, సేమంబును గోరుచుండ; సిగ్గఱివై నీ
ప్రేముడిఁ బలువకు నొసఁగితి, మా మదులను గొందలంబు మల్లడిగొనఁగన్. 60

ఉ. పిల్లవు నీవె నాయనుఁగు బిడ్డఁడవైనను నీవె యంచు నా
యుల్లమునందు నమ్మికొని యుంటిని గూఁతుర! యిన్నినాళ్ళువో?
తల్లినిదగ్గఱ న్మర్చితివి; తండ్రికనుంగవ మూసినావు; న
న్నెల్లఱు నవ్వఁజేసిత" వనిట్లను నయ్యకు బిడ్డయర్మిలిన్. 61

ఉ. "విన్నపమాలకింపఁగదె వీంద్రుఁను వాంద్రుఁనుబోలె వెఱ్ఱివై
యన్నుల మిన్నమాట చెవి యందొగిఁ జొన్పి; కడిందిబల్లిదున్;
గన్నుల విల్తుఁబోని చెలికానిని గాదని త్రోసియక్కటా!
కన్నని సుంగు డెందమును గాఱియ వెట్టుట నీకుఁ బాడియే. 62

గీ. అయ్యయో! యట్టిజగజెట్టి నవలఁ దఱిమి, చెన్నఁటికిఁ గన్నియను బెండ్లిచేసి వాని
వలన సుగములఁ గూరుపఁదలఁచుటరయఁ, గుప్పకొలిచి పేలాలు కడిఁగిసట్లు. 63

గీ. కానఁగినుక నుడిగఁ ద్రావిక నికరంబు, నీదు డెందపుఁ దమ్మిని బాముకొలిపి
విజయసారుని మనవీడు వీడకుండ, మరలను త్తరువొనరింపు మాబిడాన. 64

ఆ. అట్టునీవు సలుపవైతే నినను గూడ, నతనివెంటనను పుమయ్యా యిపుడె
యెల్లవారికన్న నెక్కుడు చుట్టంబు, మగుఫలకునుదలఁపమగఁడె గాదె. 65

సీ. చక్కెరబొమ్మలకుఁ జొక్కంపుఁ జెనులిబ్బి మదినెంచిచూచిన మగఁడె గాదె
పువ్వారుబోండ్లకు ముంగొంగుబంగారు మదినెంచిచూచిన మగఁడె కాదె
కొమ్మకూటువలకు గుజ్జుమామిడిపండు మదినెంచిచూచిన మగఁడె కాదె
పాలఁతుకలకుఁ గోరికలనిచ్చుబలువేల్ప మదినెంచిచూచిన మగఁడె కాదె
నెలఁతుకలకు నుదొంటిపున్నియపుఁబంట, మదినిదలపోసిచూచిన మగఁడె కాదె
పడఁతుకలకును వెలలేనిపసిఁడి వాడవు, మదినిదలపోసిచూచిన మగఁడె కాదె. 66

క. తలిదండ్రులపైఁ జూపఁగ, వలసిన గారాముకంటె వగకౌనిపయిన్
బలుకూర్మి చూపవలయును, పొలఁతి; సగంబతఁడు తనదు మే నేగానన్. 67

గీ. చెలువుఁడిసుకుంత చూడని చిన్నెలెల్ల, నింతులకుఁ బట్టపగలింటి యెండలోన
నిడిన దివ్వియ కాదటే యెంచిచూడ, మగనితో నున్నయది చూవె మగువ బ్రతుకు. 68

క. నెలలేని రేయి; నెత్తా, వులడఁగిన పువ్వు; మెఱువుఁ బాసిన పే
రె; లమిని గూరిచి మని చెడు, చెలికాఁడును లేని ముద్దుచెలివిత గాదే. 69

క. మగఁడు నన్ని సిరులుమ, మగువలకున్నట్టి చూవె మగఁడొక్కఁడె తే
మగువకును లేఁడో యామెకుఁ, దగుసిరులెన్నెన్ని యున్నఁ దలఁపవిలెసుమా. 70

ఆ. కన్నవారి మీఁదఁ గల తీపికన్నను; గన్నబిడ్డ మీఁదఁ గలుగు తీపి
కన్న; మగని మీఁదఁ గల తీపి హెచ్చు సూ, క్రాలుఁగంటులకును నేలఱేఁడ! 71

సీ. కడుపారఁగన్న చక్కని ముద్దుపిల్లల పైనున్న కూర్మి యేపాఱఁదోలి
కందోయికిని ఱెప్పదంచానఁ గాపాడు తల్లిపైఁగల నెమ్మి తఱిమివైచి
చెమటపట్టిన నెత్తు రొలికినట్లు కలంగు తండ్రిపైఁ గల ప్రేమ తలఁగఁ జెట్టి
తోడినీడలఁ బోలు తోడిచేడియల పైఁ దనరు మక్కువ యెల్ల పవ్వ చేసి
కన్నవారింత కలిమి నిగలిగియున్న, గవ్వయైనను ముట్టక కాఱుకాన
కెవనికొఱకే గాదమయంతి నివులఁ దమిని, మగనికై కాదె యెలుఁగ వేమన్న ఱేఁడ!

ఆ. కడఁది కొఱయె చికిలిమిని దిగనాడి, కోసకరి గ సెవనికొ అసుమున్న
పుడమి వెలఁది ముద్దుఁ బొట్టియయొలుఁగవే, మగనికొ అసుగాఁ డమన్న ఱేఁడ! 73

గీ. వాలుఁగంటికి నెటువంటి వలపుగలదొ, మగనిపై; నట్టి మక్కువ మగువ మీఁద
మగనికిని సైతముండును మగలఱేఁడ! జగమునను మిక్కుటంబగు తగులమిదియె. 74

వ. తండ్రీ! నీవోరులకుం జెప్పువాఁడవుగాని యొరులచేఁ జెప్పించుకొనువాఁడవు గా
వు జగంబున నీ వెఱుఁగని పాడిలేదు. కావున నన్నుంగూడ విజయసారునితో వె
పలనపుఁచుటొండె నతని మనవీటనిలుపుటొండె నీకెంట నీకుంబోలిన తెఱంగున
నొనరింపు" మనిపల్క "యయ్యా! కపసార విన్నపంబొకట్టి విన్నవించెద. నా

గొడఁ గనికరించి సద్దమె నాలకింపు" మని యిట్లనియె. 75

ఆ. "ఎవనిమీఁదఁ జెక్కు హెచ్చొయాతనిపా, యమునవాడు తల్లి యరసినీవు
వఱలు శూర్త్రికఁద్దవచ్చినవారిపై, నెట్టులుండునో కొక్కుయెంచుకొనుము" 76

క. అని యిటుపేఁడడుకొమరితెఁ, గనలునఁగనుఁగపనునిష్పుకలుఁగరియుంగాఁ
గనుఁగొని కరుచునోడయఁడు, తనయుల్లపుఁదమ్మినిట్లు తలఁపఁదొడంగెన్. 77

ఉ. "అక్కట! తండ్రికోరిక లనాడి సేయుచుఁ; గోడ గాంద్రకున్
మక్కువనిం డెఁగమ్మలను మాటికిఁ ద్రాయుచుఁ; బాయమింటియున్
జక్కఁగ రాక మున్నె నెఱజాణతనంబుల కెల్ల నెల్లలై
మిక్కుటమైన కొండలము మేకొనఁ జేయుదు రాఁడుబొట్టియల్. 78

క. పలు తెఱఁగులఁ జెంచినగా, దలికూఁతు రెపలుకు వినక తిరుగంబడినన్
దలిదండ్రుల డెందంబుల, కలజడియెంతంతయనుచు నలవియెనుడుపన్. 79

వ. అని నిడలపోసి కానకకన్నకూనగానఁ గూఁతుసేమియుఁ జేయుమికి గొలుపక విజ
యసారుని సంకెలలు తపలించి గవనియవలికి వెడలనడఁచి యయోధ్యాపయాండు చి
వాలునరోలగంబు విడిచి యంతిపురికిం జనియె, జేనితోడన తక్కినవారును దమ
తమయిక్కలకరిగిరి కళావతియును దలమునప్పిన కొండలంబు డెంపంబునఁ గ్రం
డుకొన నేమియుఁ దోఁచక తనలోఁ దానిట్లు తలపోయదొంగె. 80

సీ. "పలుమాఱుహజ్జుఁ బడి మొజ్జవెట్టిన నాలింపఁడాయె గాయనుఁగ తండ్రి
గారిలి నినుఁగనుక నికర వీసుమంత మదినెంచదాయె గా మాఱు తల్లి
పట్టిపైనికింతకట్లక్కఱగదని వినిపింపగైరి గావించు లెవరు
ఇదిపాటిగాదంచు హేజీబాకంతైనఁ జెలుఁపఁడాయెనుగదా తెగువ చేసి
యేమిసేయుదు; నిబ్బారి నెట్లుగడతు?, నాదు పలపుల కొలాచి; నాయనుంగు
చెలిమికాఁడేఁ బలితంపుపలపుటగ్గిఁ, బడియు మారికియు నురులు వెదలపన్నె. 81

సీ. కేలఁ జిక్కనయట్టి వేలుపుమానికం బింటఁ గల్గిల తెఱఁగంటి చెట్టు
కట్టుకంబము కేరినట్టి జేజే గద్దె పెంపు పెంచిన పున్నియంపుఁ బంట

మెప్పులీవచ్చినమినుసిగ దేవరకంటబడ్డటిబంగారుతోడవు
తిననోఁచికబ్బినతెఱగంటిబోనంబు పెట్టలోఁబెట్టినపెద్దలిబ్బి
కటకటా! పోయెనాతండ్రీకతననింక, నేమిసేయుదు! నెవరునన్నేలువారు
చెఱకువిలుకాఁడుపఱఁగించుకఱకుచుఱుకు, ములుకులకునెట్టులుసుఱులునిలిపి

క. అనిపగలఁబొగులుకూఁతుం, గనుఁగొనియాసవతితల్లికనికరమెడఁదన్ (క్రొందు
బెనఁగొన్నదానిపగిదిని, జనిచెంతను; బుజ్జగించిచనువుననని యెన్. 83

సీ. "నిండుజాబిలిఁగేరునీనెమ్మొగముతీరు మంచుగప్పినతమ్మిమాడ్కిఁదనర
బంగారుజిగిమీఱుపడఁతి! నీమెయిసొంపు వాడినలేఁదీఁగవలెనుగ్రుక్కఁ
జిగురుటూపులతీవిఁజన్నపుచ్చెడునోవి యెల్లుంబువుంబోలె వెల్లఁబాఱ
మరుతూపుగమిసేలుమగువ! నీకనుమీలు పగలింటికలువలపగదివలర
గరితరో! మాటిమాటికిమురులుకడలిఁ, బడికడనుగానకేటికినడలెదమ్మ
నేఁటిరాతిరినిన్నునీసేటుకాని, నొక్కఁతావునఁజేర్చెదనూఱడిలుము. 84

ఉ. ఇప్పుడునీదుతండ్రిమది నెంతయుఁగిన్కనుబూనెఁగాక; ఓ
మొప్పులకుప్ప! నీపడుచునుత్తలమందఁబాడఁగన్నెచూచుసే
గుప్పనఁబిల్చినీమగనిఁగూరిమి నెక్కొననింటఁజేర్చి; తా
గొప్పఁగఁజూచుచుండెదమునఁ గొందలమందఁగఁబోవునింతయున్". 85

గీ. అనిపలికియక్కశాంబవతినంతిపురికిఁ, గొనిచనియెఁగల్లకూరిమికొనలుసాగ
నామెనెనరుగడించిమేనల్లువాని, నెట్టులైననుగేల్వట్టునట్టుచేయు. 86

వ. అంత. 87

గీ. పట్టపగలింటనెత్తమ్మిపడఁతిమిన్న, నలరువిలుకానికరముననలరఁజేసి
నట్టికొలచుట్టుకొననిల్వనలవిగాక, పడియెననఁగ్రుంకెఁబడమటికడలిఁబ్రొద్దు. 88

సీ. పడమటికొండపైపడియాడుతెఱగంటి చెలులుగట్టినతోఁపుచేరలనఁగఁ
ద్రాడుతాలుపుసైఁడిమేడపైదాపినబలు కెంపుగుంపులబొజులనఁగ
వలఁకులన్నాలుగంటులుచిల్లులాడెడుపాలు పైనబగ్గుండిపాడులనఁగ

సంజకడనాఁడుమినుసిగసామిమేన, నలరుచిలువలతలలపైవెలయుమాని
కములజిగులనెల్లజగరంబునందు, సంజకెంజాయలెంతయుజానుమీఱె. 89

క. కలువచెలిదాయతోఁదమ, కొలఁపుంబోరయ్యెనపిచ్చుకుంటుజెడలుటన్
మేలఁగందనిగూండ్లకుఁ, బులుఁగులుచనెఁగందువులనుజొదిగెటఁజేర్చన్. 90

సీ. మగనివెంటనుబైఁడిమలచుట్టివచ్చెడు చాయముద్దియమేనిచాయయనఁగఁ
బోడమఁబోయెడుపాలకడలికుఱ్ఱనుమ్రింగఁ గదలివచ్చినతలగామనంగ
నెలరాకకలరిరేనెలఁతమున్నవరించి నట్టిచక్కనినీలిపుట్టమనఁగ
నెత్తమ్మివిందుమున్నీటనుబడఁబైకిఁ బొంగువార్వపుటగ్గిపొగలనంగఁ
దెఱవలనుబాసికలఁగెడుతెరువరులను, బాములనుబెట్టఁదమకేఁడువచ్చెననుచుఁ
దెలుపవచ్చినతమ్మెవదిమ్మనంగఁ, గ్రమ్మెఁజీఁకటులెల్లజగమ్మునందు. 91

గీ. అనయమునుదన్నుమక్కువదనరబిగ్గఁ, గౌఁగిటనుజేర్చుచెలువుఁడౌకలువసూడు
విడిచిచనెననితమ్మిబల్వేతలనొందె, సైపఁగూడునెయెడబాటుచానలకును. 92

గీ. తమ్మిమఱుఁగుననున్నట్టితనమగనిఁ, గానకొకజక్కవపులుంగుకలఁతమీఱ
నెమకుచుండెనుగూడనునీళ్లువిడిచి, యౌర! వలపిట్టిదనిచెప్పనలవియగునె! 93

గీ. అలజగమువింటఁగ్రుంకెడునదనునంచుఁ, దనజిగులనెల్లగేస్తులకనుపుమీఱ
నొసఁగవారనుతమయిండ్లనునిచిరనఁగ, దివ్వియలుమిక్కుటంబుగనివ్వటిల్లె. 94

సీ. నెలరేలుచెఱలాడునింగియుప్పరిగపైఁ గీలుకొల్పినమగఱాలనంగఁ
బుడమితామరమీఁదనడయాడుతఱియను తెలిపిట్టయిడుగ్రుడ్లతెగలనంగ
జగపుజాలువన్జుజాలారివైచిన చీఁకటివలనొప్పుచిల్లులనఁగఁ
మినుమాపుకడనాడుముక్కంటిజడనుండి చిందెడుమిన్నేటిచినుకులనఁగఁ
బగలనుపసిండికద్దొరపాగరడంచి, యిరులనెడునేలనదనునాఁబరుగుసలుపు
పూపనెలకోఱనెత్తవేల్పులాగఁజల్లు, విరులనంగనురిక్కలువింటఁదనరె. 95

సీ. మలవింటిదునెదారితలనొప్పుఠాబంతి మీనుడాల్దొరకూర్మిమేనమామ
మిన్నుఁద్రిమ్మరులకుమెకలువెట్టెడుసామి నెగకంటిచెక్కినమానిజగెలెకాఁకు

కలుములఁ దలకూర్చు క్రొన్ననంటి సైదోడు రతనాలగనికి గారాబుపట్టి
మిసుతమ్మికొలఁకున మెలఁగెడు రాయంచ బండిరిక్క వెలందివలపుకాఁడు
మందులను బెంపొనగ్చెడు మన్నెగాఁడు, కలువజవరాలికింగూర్చు చెలిమికాఁడు
చలువసొంపులు వెదజల్లు చందురుండు, తొలికడఁ జెలంగె వెన్నెలపులుఁగులలర. 96
సీ. పాలమున్నీటిపైఁ బవ్వళించినకట్టి సంగాతకాని మైచాయ యనఁగ
విరిసిన తెలిదమ్మి విరిమీఁదనలరారు జమిలిముక్కాలులగుమి యనంగ
గిబ్బబాబారౌతు గుబ్బలిపైనొప్పు గడితంపుఁ గతిమబ్బుగమి యనంగ
గనువిప్పు దొరలజక్కర మిక్కుటంబైన వలపులీనెడు నల్లకలువ యనఁగ
సోఁకుమూఁకలనడఁచిన జోదుతోడు; మొలను దాల్చిన నీలిదువ్వలువ యనఁగఁ
జందురునియందుఁ దనరారు కందు మెఱసెఁ, జూచువారల చూడ్కికిఁ సొబగు నిగుడ.
చ. దొరయుగుఁ బ్రొద్దుగ్రుంకఁగనె తోరపువేడ్క జగంబు సేఁచఁగా
తిరులనుఁ బ్రాఁతఁ వేలుపొకఁ జేత్తఁ దుముట్టఁగఁ గల్వరాయఁడన్
సిరిమగఁడాతనిం గడపి చెచ్చెర నెమ్మొయి దారిపిండునై
బారిపొరిఁ జల్లు నక్కటికపుంజలకంబనఁ బొల్చె వెన్నెలల్. 98
వ. ఇట్లెల్లయెడలఁ బిండియాఱఁబోసినట్లు పండువెన్నెలలు గాయుచున్న తఱిమంజు
భాషిణి సారెసారెకు నీరిక లెత్తు తనకోరికలం దీఱుచుకొననెంచి యయ్యాలుమ
మగల నొయ్యనొయ్యన నొకకందువతావునఁ జేరిచి యారాచేడియ యూఁపని బా
డకుండ దిట్టరులగు జెట్టులం జుట్టుపట్టులఁ గావలి వెట్టి తనయిచ్చం జనియె నంత. 99
చ. కనుఁగవనీరు కాల్వలయి కాఱఁగఁ; గొప్పరజాతిమూపునం
దనరఁగ; దొట్రుపాటడుగుఁ దమ్ములఁగూడఁగ; వేడ్కకాని మో
మునఁ దనమోము చేర్చి వెత పొంకెను రాజకొమార్తె; యాతఁడున్
వనటను మున్గి యేమియును బల్కఁగ లేక కలంగె నెంతయున్. 100
ఆ. కొంతదనుక నిట్టు కొందలంబున మున్గి, యొకరికనుల నీటి నొకరు తుడిచి
వైచికొనినపిదప వలపునదళివాయి, కొడుకుపలుకు జేనికూఁతుఁ గాంచి. 101

ఉ. "దయ్యముఁ జాలిమాలినను దవ్వొనరించెనటంచుఁ గుండియల్
వ్రయ్యలువాఱ నీవిటుల వందుర నేటికి నాదు బొందితా
నెయ్యెడనున్న నేమి; యీసు జిక్కఁడె యుండునటంచు నమ్మిమీ
నెయ్యము ద్రెంపికొన్నఁ జెడునే; మగువా! మదులొక్కటైనచోన్. 102

మ. అలరుంబోణిరో! యామడల్ మిగుల దవ్వైనన్ మనుల్ దవ్వులే?
కలఁతంబొందిన కూడివచ్చునట వేకర్జంబు సుంతేనియున్;
బలురావం గడమందుఁ బుట్టి చదువుల్ బాగొప్పఁగా నేర్చి నీ
వెడఁదండిట్టుఁ దన్నంబు పీడినను నే నేమందువాల్గంటిరో! 103

క. ఎడబాటును గూడిక యును, బడఁతీ! సతమనుచుఁ దలఁపవలదుల్లమునం
దపరెడు కూరిమి కొన్నా, ళ్లెడమై సన్నిడిచిపోవునే? యెలనాగా!" 104

వ. అని యీఱడిలం బలికిన పలుకుల కచ్చిలుకలకొలికి యాలజడి యొకించుక యాఁడఁ
చికొని పొరలిపొరలి వచ్చు కన్నీరు ద్రుఁడ్లం ద్రొక్కికొనుచు విజయసారునిం దిలకించి
యల్లనల్లన నిట్లనియె. 105

ఉ. "నా వెలలేని మానికమ! నాకనుగల్వల చందమామ! నా
దేవర! నాయనుంగవలదీవియఁ జెంపొనరించు నెల్మికాఁ
డా! వెతలొందుచున్ విఱవిలాఁతికి నీవిటు లేక నింక నే
నేవగ నైతు నీవలపు టింగలపుంబలు కాఁక కక్కటా! 106

చ. కనుఁగవ నొక్కసారి నినుఁ గాంచినఁ జాలు వరాలమూట నా
కొనరిన యట్లు సంతసిలు చుండుదు; పిరొకపల్కు చెల్మిమై
ననిన నువేల్పుఁ జేని సిరియంతయు నబ్బిన యట్టులుబ్బుచుం
దును; నినుఁ బాసి యీయొడలితో నెటు నిల్తును జెల్వపుంగనీ! 06

సీ. తమిఁ బంటకాదు పున్నమనాఁటి రేవెల్గు పోలుపు మీఱఁగ వ్రోల నిలిచినట్లు
త్రోలిబాము నందలి బలుపున్నియపువామి యొడలు దాలిచి కంటఁ బడిన యట్లు
పిలువ మాటయటుండఁ గొలఁది చెప్పఁటకైన దొరలేని రతనంబు దొరకినట్లు
కలఁగన్న పేదమక్క అదీఱ మేల్కని పెనులిబ్బి తోడ నేకనినయట్లు

పొందునాయెడసంతోసమునుగరంబు, నిన్నుఁగనుఁగొనినపుడెల్లనీటుకాఁడ! 108
కటకటా! నీవుదవ్వైననెటులనోర్తుఁ, జిలుకదొరరౌతుబలువాఁడిచిలుకగమికి.

చ. వలపనునీటివామిఁబడి బాములనొందుచునొడ్డుగానకు
త్తలపడుచుండమాలిమివితంబునఁ జెంతకునేఁగుదెంచినీ
బలితపుఁబ్రేమ్మనాఁగలముపైనిడినన్ దరిఁజేర్చియీయసు
ల్నిలిపినసామివీవ; యెటునిన్నెడబాయఁగనేర్తునక్కటా. 109

చ. చిలుకలుగూయ; రేవెలుఁగు చిమ్ముఁగనిప్పులు; కోయిలల్ హాళా
హాళియొనరింపఁ; దెమ్మెరలు హోవడిసల్ప; మరుండువాఁడిము
ల్కులుగురియంగ; వేడిమిని గొందలమందెడునప్డు నామదిన్
జలువలెసంగఁజేసినను సాఁకితివెట్టులవీడుదునిన్నున్. 110

గీ. నెగడుకార్చిచ్చుఁబోలువెన్నెలలచేతఁ, వేఁగుచునుసైపఁజాలకవెతలఁగుడుచు
పట్టుననొసంగికెమ్మోవిపానకంబు, నిలిపితివిమేనునినుఁబాసినిలువఁగలనె. 111

చ. అలరుజిరావజీరుసాబగంతయుఁ జూఁజఁగొనంగఁజాలునీ
చెలువము; పున్నపున్నెలని సీయనిదూఱెఁడుముద్దుమోము; వె
న్నెలనగునీముచిర్నగవు; నిచ్చలుడెందమునందలంచి నే
వలపెటునిల్పుదున్మరునివాఁడిలకోరులకెట్టులోరుతున్. 112

చ. పనిగలయప్పుడీపొరుగుపల్లియకీవుచనంగనంతమైఁ
గనుఁగవవత్తిపెట్టుకొనికాచుచునీచనుత్రోవఁ; జప్పుడై
నననటునిల్చినీవయనినామదినెంచుచుఁదేఱిపాఱఁగాం
తునుగడుదవ్వువోవమరు దూఁకలికెట్టులసైతునక్కటా! 113

గీ. మదికరఁగునీదుతీయనిమాటవిన్న, నీమొగముఁగన్ననెమ్మదినిండుమరులు
గగురుపాడుచునుమేనునీకడనునిలువ, నలవియేనిన్నుమరువ? నెయ్యంపుసఖుఁడ!

చ. ఇరులాగిఁగ్రమ్మనీమొగము నించుకకన్నడవుండఁజేసినన్
బురపురపొక్కనానొయని ప్రొద్దికఁగ్రుంకకమున్నప్రాఁతలన్

దురమునదిదివ్వె తెమ్మనుచుఁ దొందరసేయుదునట్టిదాన నె
ప్పరుసునన్ నిల్పికొందు మెయిఁ బాసినినున్ దొరలేని నెయ్యుఁడా! 115

గీ. ఆఱునెలలైనపోయిగాననఁగెపెనఁగె, కూర్మిమైనొక్కతావునఁగూడియుండి
కంపపలనాడి కొనపరడఁగటికదయ్య, మక్కటా! దవ్వుగావించెననుఁగుసురుఁడ!

క. నేరిచిన నేరకున్నను; గారామారంగనొక్క కైవడిఁగనుచున్
గూరిమిమీఱఁగఁ గాఁగిటఁ, జేరిచి కాపాడినావు చెలికాఁడ; ననున్. 118

సీ. ఎన్నఁడు నాపూఁదనిసుమంతకిని యవు నెనయనఁగనుఁగొందువననగముల
నెఱిఁగి నాకోరికలింతలోఁదీర్తువు చెల్లెంద్రవలెఁ జెఱవెలుఁగఁగాంతు
వాడితప్పువుజగంబట్టిట్టులైనను విడువవోరెమి నెట్టియెడలనైనఁ
జెఱల పైకము చిల్లపెంపగాఁ జూతువు మించ నాడవు బలుక్రించునైన
నంచ నెఱతౌతుగ్రుడ్డులనసమనువిరి, మల్లెపూఁదావులను వెదజల్లినావు
విద్దియులకొజ్జబంతివై వెలసినాఁడ, విట్టినినుఁ బాసియెట్లుందు నెమ్మికాఁడ! 117

ఆ. కడిఁదిసిరులనపరుపుడమితాలుపునకుఁ, బాడమకొక్కపేదకడుపునకుఁ
బుట్టినట్టులైననిట్టిచెట్టులులేక, బ్రతుకవచ్చుఁగాని రహివదలిర్వ. 119

ఆ. అట్టిగొప్పకలిమియా వేలుపుల వేలు, పొసఁగఁదాయెఁ; గొర్కి పొసఁగదాయె
నెవరి వేఁడుదాన; నెటువీడుదానని, నలరువిల్తుబారికగ్గమగుచు. 120

సీ. జాజులు వెదజల్లు చందంబునను ముద్దుపద్దెంబులనుగూర్చువారలెవరు?
పట్టిమాటలు చివుర్చెట్టునట్టుగ మంచి వలపుపాటలఁ బాడువారలెవరు
వేనవేల్దు నెదార్లు వేవచ్చి తాఁకిన బవరంబుగావించువారలెవరు?
కలికిపదియాఱువన్నెబంగారుమేడ, పైని హొర్చుండి జిలిబిలిపలుకులాడి
యొలమినాకొడగూర్చువారెవ్వరకట?, నీవుమావీడు వీడిననీటుకాఁడ!" 121

వ. అని పలికి యచ్చెలువ బలితంపుటలజడియు; నలుకయుఁ; దన తలఁపున నలమి
కొన "నక్కటా! యొక్కపుఁ [illegible]లారా! కానకకన్న మక్కువ
పూఁతురొక్కతియొకదా యను నక్కటికం బొక్కించునైనలేక చిక్కువెట్టుట

పాడిరే" యని కన్నవారి నెన్నియోవగలఁ దెగనాడుచు "నోయిలు వేలుపులా
రా! మీవరం గేలుసాచి మ్రొక్కెద—మాయయ్యదండంబునం గ్రందుకొనినప
లుగు తలఁపులఁ దొలఁగించి మాయెడ నాయనకు నేయం బొదవునట్లు చేయరే"
యనిపలుమాఱు బ్రతిమాలుచు నింతంతనరానివంతకడలిమునిఁగియున్న యదనున.

చ. కడవలఁబోసినట్లు కనుఁగ్రంతలనీళులుజాలువాఱఁగా;
నమగులుతోఁట్రిలంగ; మదియందలిదిట్టఁదనంబుతూలఁగా;
నవలుచునీడలేనితమి నల్లననీరెలుఁగొప్ప; బల్కెన
న్వవశతుకమిన్నఁగాంచిపడ వాలునిసుంగుకడిందినెంజిలిన్. 123

క. "నెనరేదివయ్యమక్కట!, ననుపత్త్వేనరించెఁగాన నాతిరో! నిన్నే
మనియూఱడింతు; నెవ్వగ, మనకిద్దఱకొక్కరూపెమదఁదలపోయన్. 124

క. నామానికములమూటా!, నామెయిగందంపుఁబూఁతా? నాపూబంతీ!
నామదినినిలుచు వేలుప!, యేమాదిరినిన్నుఁబాసిమేఁకుదునయ్యో! 125

గీ. మొగపుటాముసఁజుక్కడిమొగమునందు; నలఁతినగవను వెన్నెలపాలయఁజేసి;
కలికిరాసిరికరణి నాకడనునిలిచి, యెవరుగలిగెంగ్రొనుకందొయి కెలమినింక. 126

ఉ. ఈనినపువ్విచందమున నెక్కడవచ్చెనొ మారుతల్లియం
చూనినబీకునమ్మగల నూర్చుచునీవును; జెల్లసీకుచే
నేనువడంకుచొండురుల నిండుకవుంగిళులన్మెలంగుచున్
జానరో! నాఁడుపూఁబోడను జల్పినసేవగముంచెనకెదఖిన్. 127

ఉ. నీకొకవేలుపుంబలెను నెవ్వగలందొరఁగించిప్రేముడిన్
బోషిఁగనిన్ని నాళులును బొల్పుగనేగను; మీఁదనెవ్వరిం
గావుమటంచువేఁడుచును; గ్రన్ననినెన్నెడబాసియక్కటా!
రేవగఁబోవువాఁడనిఁకనింతిరో! మిన్నులువడ్డచోటికిన్. 128

ఆ. జగముతేలురాచ మెగపురాయనికంటె, నీవెనాకుకంటికెప్పుడనుచు.
మున్నుపలికినట్టిమురిపెంపుఁబలుకీఢు, మగువ! నన్నుముంచెమరులుకడలి. 129

గీ. పడికి సైరించితిమిగాని యెడఁదలోక్క, క్రైవడి నొసర్చి మెలఁగెడు కలిమి మనసు
దయ్యమొదవింపక యెచేసెదవ్వుతోంటి, బాములందేరి నేస్తంబుఁ బాపినావొ. 130

చ. కలువల ఱేఁడు నీ మొగము క్రైవడి నుండు నటంచు నెందఱో
తెలుపఁగ వింటి; సెన్నఁడును విన్నఁగఁ గాంచియెఱుంగ; నిప్పుడో
చిలుకలకొల్కి; యక్కలువ చేసెడు వేడుక కానిఁ జూడఁగా
వలసెను మీఁద నేమికనఁ బొల్పుఁ జేయునొ! దయ్యమయ్యయో!" 131

క. అనిపలికి "వాలుఁగంటీ!, విను" మని మఱియిట్టులనియె "వరవేకికి నే
యనువున సైఁపవొ నిన్నుం, గనుఁగొనఁగ నెనారుయెడం దక్కలవరపడెడున్. 132

చ. పడఁతిరో! కావుపొ్రడ; విఁకఁ బాయము చూడఁగ లేఁత; కొందలం
బడఁగెడుమాటలం బలుప నట్టియనుంగఁ జెలుల్ హుళిక్కి; నీ
యెడఁదనుగల్గుబాళి విన నెవ్వరునుందగువారుసున్న; యే
వడువునఁ దాళఁగాఁగలవొ పైదలిరో! విరివిల్తుదాడికిన్. 133

ఉ. తమ్మినివాలితేనియలఁ దొ్రవెడుతుమ్మెదకొమ్మవోలె నా
నెమ్మొగమందు వాలికడు నెమ్మినివాతెఱ నానునిందలోఁ
గమ్మనివింటిదంటబలు కాఁకలకోరువలేక సుక్కిఁదీ
వెమ్మెయిఁ దాళఁగాఁగలవొ యిప్పుడునన్నెడబాసి యక్కటా! 134

గీ. తఱిపులుఁగువోలెఁ జట్టుపల్ దాల్చిపరుగు, వాఱుచున్నది చూడుముప్పరవునందు
విండఁగావచ్చెనప్పుడే రెండుజాలు, నిలువరాదిట నేనొక్కనిముసమైన. 135

ఆ. నీదుసవతితల్లి నెఱజాణ మనవిఁ ప, నలుకవూనియున్నయది; యొకింత
ఱేనితోడ నిచట నేనున్న సుద్దిఁ దాఁ, జెప్పె నేనిపుట్టు సేగిగాన. 136

క. సెలవొసఁగి నన్నుఁ బంపుము, వెలఁదీ! యుజ్జయిని యనెడు వీటికిఁ జనెదన్
బళిపుటలజడి విడువుము, తలఁపుము నను జల్లనైన సఖ్యంబునన్. 136

ఉ. ఓరిమిమానఁబోకు; మెదను త్తలమందఁగఁబోకు; కల్వలం
గేరెడుకన్నుదమ్ముల నొకించుక సిరిడఁబోకు; కోర్గలన్

దినిగలిగియుండనుసుఖ"ని, కనుఁగవనీర్గారనతనిఁగడు వేఁడికొనెన్. 147
గీ. అందులకునీయకొనియతండామెమెడను, వైచెఁదనపత్త్రికనుఁగ్రాలుబన్నరసము
"విడకతనయెడఁగలుగుప్రేమకిదిఁదగిన,యంగమచ్చంబుగాఁదాల్పుమా"యటంచు
గీ. పిదపవారొండొరులమీఁదఁబొదలుకూర్మి, బ్రదికియున్నంతదనుకనువదలకుండఁ
జెట్టకలనేనిమదిఁదలపెట్టుకొనక, యుండనొట్టిడుకొనిరివారొక్కరొకరె. 149
వ. అంతఁ గళావతి చెలువునకు విలువగల పలువగలనగలును; లెక్కలేనిరొక్కం
బును నొసంగి యాతనికి మేలుగలిగింప నెల్లవేలుపులకుంగడుబత్తి గిడిగిళ్ళొనరిం
చి మఱియు నిట్లనియె:
చ. మడుపుసగంబునేఁగొఱికిమక్కువఁదక్కనసామిహాళినీ
కిడఁగొనకున్నడెందముననెంతయువిన్నఁదనంబునొందునన్
బొడగనినవ్వియమ్మడుపుముందుగఁగైకొనిముద్దొసంగి; పెం
పడరఁగ నేలినట్టికతయంతయుమర్వఁగఁబోకు నేస్తుఁడా !
ఆ. నీదుసేమమెల్ల నిచ్చలిచ్చలుమిత్ర, దాసుపేరజాబువ్రాసియనుపు"
మనుచునొడివిజాగనంపెనుదనపెద్ద, కానినెట్టులెట్టొకలికిమున్న. 152
క. సిడమునఁగట్టినపుట్టము, వడువునమదితడఁబడంగఁబరిదొరబిడ్డం
డిడుగామడదాఁజనియెను, బడఁతింబెడఁబాయలేకవలవంతమెయిన్ 153
ఆ. తిన్నునీడలేకతలముదప్పినవంత, మగఁడుచనినమిగులనొగిలిమగువ
కన్నుదోయినీరుకాల్వలైపాఱంగ, సొమ్మసిల్లి తోడికొమ్మలెల్ల. 154
ఆ. సేదదేర్పలేచి"చెలికాఁడ! యక్కటా! పోతె నేఁడునాదుపొందుఁబాసి?
యీవులేనిప్రొద్దులిరులుగ్రమ్మినరేల,పగిదినుండు"ననుచుఁబొగిలిపొగిలి. 155
సీ. వగకాఁడుతానునుబవళించుపూఁబొదల్ గనికనుల్ కటికచీఁకటులుగ్రమ్మఁ
జెలువుఁడాడినముద్దుపలుకులఁదలపోసిపగిలిడెందమువకావకలుగాఁగ
మగఁడు నేరిపినసోయగపుఁబాటలనురాచిలుకవాడఁగఁజెవుల్ చెవుడువడఁగ
మునునన్పుగాఁడువేడ్కనుబొనర్చినమంచిపనులెంచిపనులెఱిఁగుండెజల్లనికలంగ

గాముసోఁకినకైవడిఁగళవళించు, వినువిఱిగిమీఁదఁబడ్డట్టువిన్నఁబోపు
నుడివినట్టిజనుఁడువును వెఱఁగుపడి, మగువమదితూలుమిక్కుటంబగువిరాళి. 156

క. పెనిమిటిసోయగమును; మేల్గానమును; బరవసము; తేజు; గొప్పఁదనంబున్;
దనడెందంబునఁదలఁచుచుఁ, గన్నుఁగ్రంతలనీరునించికళవళమందున్. 157

క. నగలెల్లఁదీసికడునె, వ్వగఁగూరుచునొడలుబడలవడినొకనెలతా
జగిలెపయి మేనుసేరిచి మగువమునింగెనుగడిందిమరులనుకడలిన్. 158

వ. మఱియునవ్వాలుగంటిముక్కంటికంటిమ్మంటను మంటఁగలియనినాఁటితుంటవిలుకానిచక్కందనంబు నెక్కసక్కెంబులాడు తనమక్కువకాని చక్కందనంబను జక్కర నొక్కమ్మడిమునింగినడెందంబునుమండలించుకొనంజాలక బేలయైలోఁగి కలంగి బెంగగొని జంగంబెఱుంగకమిన్నుమన్నునుగనరానివెరవేఁకిసోఁకికఱటి చెఱకువిలుదొర బూటకంబనుగాటంపుఁగటికచీకఁటిండవిలి; కన్నుగన్నుగనరాక చీకాకుపడి; వీఁక చెడి; యొడలిబిగిసడలి; యడజడింబెగడి; దయ్యంబుం దెగడి; గమ్మనివలచు చొక్కమ్మగుకమ్మతావులువెదజల్లుతమ్మిరేకులపోడిమినిగోడిగమాడు నిడువాలుకనుంగవం గాఱు బుడిబుడిక్రొవ్వేఁడికన్నీరుసుద్దంపుఁజెక్కుటద్దంబులంజాలువాఱఁ; బున్నమనాఁటి వెన్నెలఱేనివిన్నంబుచ్చుతిన్ననినెమ్మొగమ్ముదమ్మి వెలవెలవాఱఁ; జిందంబులకందంబును బొందుపఱుచు చిన్నారికుత్తుకంగ్రాలుముత్తెపుసరాలు వెరవేఁకికాఁకలంజికిలి పొడిపొడియైపుడమింగూర; వెలలేని రతనాలుదాపిన మెఱుంగుహొరంగుబంగారు సింగారంపుఁనెడవులు విటతాటంబుగామాఱ; వేలుపురాఱాజగాజిగులందెగడుసొగసుక్రొవ్వాదసడలినెత్తావులుగుమ్మరించుక్రొత్తవిరిదండలు మెండుగజాఱ; విదియచందురునందంబును గ్రిందుపఱుచు పొన్నఱెనెన్నొసటంబొఁకంబుగనిడిన జింకపొక్కిలిచుక్క మిక్కుటంబగు చెమరునఁ బదనెక్కి నెమ్మొగమ్మునఁగ్రమ్మిపాఱఁ; బగడంబులతో జగడంబులాడు బిగిమీఱుచిగురుమోవి బెట్టిదంబగునిట్టూర్పుక్రొవ్వేడికాఁకలకుంగసుగంధపల్లు విరితెఱంగున వెల్లఁబాఱ; నేదచెదరి బెదరి బెదరి చూచుచుఁ; గళవళిం

చుచు; గడగడవడఁకుచు; ననురుసురనుచుఁ; గటకటా! తుంటవిలుకాఁడా! నీకం
టికిం బేలగింజయుం బెద్దదియయ్యెనే? చేటుపాటెఱుంగక నాబోఁటిబోటులం
మాటిమాటికిం బలుఁబాటులువెట్టి యేము కట్టుకొనియెదవు? కన్నియలసురుసురన్న
నక్కొలకట్టికుడుపక మదిమదిఁ బోదుసుమీ. నీవును నాఁడుతోడునం బుట్టినవా
డవే కొంచము నీక్రించుఁ దనంబు నడంచి మంచితెరువువట్టి మాయట్టివాలుగం
టులపైఁ గంటువిడిచి కనికరంబును బూనవే" యనిపలుకుచు; లేచితలయూఁచి;
నలువలఁకులు దిలకించి; తేఁకువఁద్రోచి; గాటంపుఁదమిఁదనసీటుకాని నీటులు
మాటలుపాటలుకూటములుసయ్యాటలు తెలివితేటలు మాటిమాటికి డెందంబునం ద
లపోసికుందుచుఁ; జెఱకర్జమ్ములురోపి; సిరికొమరుండు విరివిగంగురియించు విరిచి
లుకుగము లాడలెల్లంగాడినం దాలిమిమాలి; యంచపూడియనించిన నునుబానుపున
నొత్తుయ్యనద్రావాలి; వలపుపెట్టింబడుటం జేసి; తెలివిదూలి; యంచంపనసంగడికాఁడె
ట్టయెదుటనిలిచినట్లు పొడకట్టినం బట్టరాని కట్టాసంగట్టుపడి గట్టువిడిచితుట్టతు
దకుఁ "గట్టా! నాపెట్టుచెట్టా! నారతనాలకొట్టా! నాపున్నెములతిట్టా! రాసింగ
పుఁదలకట్టా! కట్టిఁడి మెగంబులు కొట్టుమిట్టాడు సట్టదవుల నెట్టి పెట్టిదపుటిక్కట్టు
లకునికిపట్టయితివోగదా. నిన్నువీడినదిమొదలుఁ గ్రొన్ననవిలుకాఁడు కన్నునసెట్టఁ
జేయుచుఁ గఱకువిరిమ్ములుకుల్లంజిమ్మి నెమ్మేనిసొమ్మసిల్లం జేయుచున్నవాఁడు. వా
రువపుటగ్గితోడం బుట్టినసిరితోఁబుట్టువుబిట్టుగనుడుకు వెన్నెలలుగాయ; జముకడం
బొడమి చెడుగువిసదారుల కోరెంబుగా నోరందూఱియు నలుగక గోరంపువిసం
బును వెదలంగ్రక్కుచు వెలువడిన కరువలి కుఱ్ఱండు గడితంపు వేఁడిగాడ్పుల
మేదివియు; బడలజేయ విరిగుత్తులతేనియ లాహోవంద్రావి మత్తుగొని తుమ్మెదదిమ్ము
ఝుమ్ముఝుమ్మనిరొదసేయఁ; గమ్మని క్రొమ్మావిచివురులపేసంబు లాసంగాసంబు
గాఁగొని గండుంగోయిలపిండు గుండెలుజల్లుమనఁ జెవులుచిల్లులువడంగూయ; నొ
క్కనిముసమైన నుసుఱులునిలుపఁజాలకున్న దానఁగ్రక్కునవచ్చి మక్కువమీఱఁ
గౌఁగిటం జేరిచి పుక్కిటపీడియంబిడి చెక్కులుముద్దాడిచక్కనికేల్దమ్మి నొక్క

సారి నెమ్మోనినిమిరి వెన్నెలలకునన్నదమ్ములవోని చిన్నినవ్వులనొలయఁజేసి నా
డెందంపు వెన్నెలపులుగునకుఁదనివితీఱ నా మెతలాసంగి; పంచదారపలుకులం
జిలుకు తియ్యని పలుకులనొకపరిం బలికి నావీనులకు విందుగావించి యీవలకాఁక
లఁబోకార్చిసాఁకవే” యనికేల్సాచి మ్రొక్కుచు! బయలుకౌఁగలించుచుఁ; బలు
కరించుచుఁ; గన్నీరునించుచుఁ; గలువరించుచునుండికొంతవడికిఁ జెలివితెచ్చు
కొని తలిరులకోరీసురతాణి గరువంపుఁగఱదులు మెచ్చుచుఁ; దనలోఁదానొచ్చు
కొనుచు నిట్లుతలపోయందొడంగె.

సీ. “కలుగునా? యొకసారికనులపండువుగాఁగవగకానిముద్దునెమ్మొగముఁగనఁగ
నబ్బునా? యొకసారియలరుటెత్తులఁగ్రుచ్చి చెలువుని మేనఁగైసేయనాకు
దొరకునా? యొకటముద్దులమూటగట్టెడు చెలికాని జిలిబిలిపలుకువినఁగఁ
జిక్కునా? యొకతూరిమక్కువదీఱంగ మగనిఁగాఁగిటఁజేర్చిమనెడునాడమి
యొదవునా? యెన్నఁడైన నాయుల్లమలని, యుల్లమునఁజేర్చిసంతోసమట్టిపడఁగఁ
గందువలవాడికొనునట్టికలిమి! యకట! యేటియీఫలిగలిగింతలెంచిమాడ. 160

ఉ. చేరలఁగొల్వఁగాఁడగినచిన్నికనుంగవ; తుంటవిల్తుసిం
గారపుఁగొల్వుకోటమునఁ గ్రాలెడుసింగపుగద్దెలొమ్ము; బం
గారుమెఱుంగులీనుమెయి; కల్వలరాయనిఁగేరుమోమునో
య్యారము; నామదిందవిలియచ్చునవొత్తినయట్టులొప్పెడుఁ. 161

సీ. కలువసంగడికాని చెలువుమీఱెడువాని మోమునఁగదియించుమోముమోము
పగడాలడాలుపైఁబడఁబూనఁదగువాని మోవినిముద్దాడుమోవిమోవి
కెందమ్మిచందమ్ముఁగ్రిందుచేసెడువాని కేలునఁగీలించుకేలుకేలు
కరఁగినబంగారుకరణినొప్పెడువాని మేనిఁగౌఁగిటఁజేర్చుమేనుమేను
మల్లెపూలతావిమాడ్కిరిచెసలను, నలమికొనినవానియసమువిగుల
ముద్దుదొలుకఁబాగడువిద్దియవిద్దియ, వానిఁగలసిబ్రతుకుబ్రతుకెబ్రతుకు. 162

ఉ. చక్కఁదనంబుమిక్కుటపుజాణతనంబునుగల్గి; రూపునన్

జక్కరవిల్వజీరునెకసక్కెములాడెడువన్నెకాఁడవో
డక్కునెనాకునింకనకటా! కొ అనోములునోమినట్టి నే
నెక్కడ! వానిఁగాంచుటదియెక్కడ? నంతటికల్మియబ్బునే. 163
గీ. కన్నులనుకల్వపూవులకలిమియడఁగ, నెలమియనియెడువెన్నెలపులుఁగుడస్స
నిరులుడెందంపుఁబసిఁడియుప్పరిగఁ గ్రమ్మె, నెలనుబోలిననాముద్దుచెలువుఁడరుగ.
క. తొలిబాముల నేనెవ్వరి, కలయికలంజెటిచినానొ కావుననాకి
ప్డలవడియెనునీబలితపు, వలకాఁకయిఁకెట్లుసైపవచ్చునునయయో! 165
క. సిరముంబాసినవెంద్రుక, పరుసున! దాటంబులేనిబంగారపుబొం
గరమువలెఁ; జెట్టువిడిచిన, మరుతత్తడిపగిదినాదుమనుగడయయ్యెన్", 166
వ. అనిపలువగలంబొగులుచు సింగారంపుఁదోఁటకుంజని. 167
సీ. "ఇదిగదాదారబిడ్డఁడింపుమీఱఁగవీణమీటి మెప్పించినమేటిచోటు
ఇదిగదానన్నుకాఁడెలనిమ్మైనెలుఁగెత్తిపాటలుపాడినమేటిచోటు
ఇదిగదావగకాఁడుమదిగరంగఁగముద్దుమాటలనాడినమేటిచోటు
ఇదిగదానీటుకాఁడెనలేనికూర్మిసయ్యాటలనాడినమేటిచోటు"
అనుచుఁబొదపొదపరికించు; నటమటించుఁ! గంటఁబడ్డట్టిచెట్లులగట్లనడుగుఁ
దాతగీఁతనుదలపోసితలఁకుచెందు, వలపుదొరదాడికోడియవ్వన్నెలాఁడి. 168
వ. ఇట్లంతకంతకు హెచ్చు మరుచిచ్చునకుఁదాళంజాలక వలరాయనిందలంచి జో
హారు వొనర్చుచు నిట్లనియె. 169
మ. "సిరిపూబోణికిఁబుట్టియెల్లజగముల్ చీకాకుగావింపఁజా
ల్వీరివిల్లొక్కటికేలఁబట్టికినుకన్ వేధైనగోవాళ్లఁ గ్రొ
వ్విరిబొండ్లంగలయంగఁగూర్చుదొరవీవేకావె; నాపట్టునన్
మరుఁడా! వేఁడిమిచూపనాయమగునా? మానీగదే క్రమ్మొక్కెదన్, 170
క, నలువమొదల్గాఁగలవే, ల్పులనందఱగెలిచినట్టిప్రోడవునీక
ట్టలుకకువాల్గంటులనం, బులుపరకలు; నెనరుచూపిప్రోవవెమరుఁడా 171

సీ. కనులెఱ్ఱఁ జేసెడుగడితంపువెల్లువపోటుగన్పడకుండఁ నాడు చిలుక
చెట్టులఁ జిగిరింపఁ జేసెడుపడవాలువిన్నంటినడయాడుఁ వింత తేరు
ముక్కలైననుమొల్చుచక్కనియించువిల్ ముట్టకుండగ ప్రోగునట్టినారి
కొడుకకెప్పుడుపండుగొలుకుపుల్గుహుమాయినీటజాడలుదీయ నేర్చుపడగ
గలిగిపొలయుల్కనలిగినచెలులమగల, నొక్కటిగఁ గూర్పఁజాలినయొప్పిదంబు
నీకె కాక మఱెరికీ నేలఁగలదు, వలపులకుఁ ఱేడ! కమ్మవిల్గలదునీఁడ' 173

వ. అని మంచినుడుల నించువిలుతు మందలించియుఁ గొంచియమైన కాఁకవల తొలఁ
గమికిఁ గలఁత నొందుచు మఱియు నిట్లనియె. 174

గీ. తుంటవిలుకాఁడ! ముక్కంటికంటిమంటఁ, గాలియునుము త్రిగనలేక గాలినదుచుఁ
గంటఁబడకుండ నేచుచునుంటివకట! తొయ్యలులమున్న సలిపినదోసమునను.

ఆ. కానఁబుట్టిగానఁ గాల్చుకొర్చిచ్చుకై, వడిసెడందఁబొడమియెడఁదఁగాల్చ
చుంటివిగిరియెకొదెతుంటరీ! తడిప్రాతఁ, గుతిక మెల్ల మెల్లఁ గోయుటనఁగ. 175

గీ. కడలివార్వపుఁ గిత్తికై వడినివలిమ, లల్లుకినుకనుగ్గినీయంగ యడరు
నట్టు కాదేని బుగ్గియైనట్టినీవు, వేడియూటెట్లుమమునుబోఁటి వెలఁదుకలకు. 176

క. బలుకనికరపుంగనులై, వెలసినవెన్నునకుఁ గలిమి వెలఁదుకకెటులం
గలిగెతివివేల్పుటొరెము, గలిగినపాల్కడలివిసముగలిగినపగిదిన్. 177

గీ. అనిపలికి రిక్కల తెరువున్ మిక్కుటపు టుడుకు వెన్నెలలు గాయు చుక్కలదొరం
గాంచి యా చక్కెరబొమ్మ యిట్లనియె. 178

సీ. "పాలమున్నీటికిఁ బట్టివి; కలిమిపూఁబోఁడికిఁ గూర్చుసైదోడవల్ల
కన్వడిసంగాత కానికిమఱఁదివిన బ్బితత్తడిజోదునకుసునగవు
దుక్కనికన్నెలతమిదీర్చువిందవు వేలుపులకువిందు వెట్టుదొరవు
మీనుటెక్కెంపుసామికి మేనమామవు; జగముచుట్టమునకు సంగడీఁడ
విట్టినీపక్కటక్కటా! యించుకైన, మంచియనునది లేక క్రోమిగ్గించుబోండ్ల
సారెసారెకుఁ బలువలచందమునను, గొందలమువెట్టుటందమా? చందమామ!. 179

క. చెలియలిగీమునఁ దనరిన, కలిమి నెకడ తేర్చినావు కటకట! పెలతో
చెలులనిననీకు నెనరెదఁ, గలుగు నెనిను గామ్రుమింగ కలువల ఱేఁడా! 180
గీ. కంటు పేరింటి చేరునీ కడుపు ననిఁడి వెన్నెలలు చిమ్ము చుండువు వెలికి నీవు
కుత్తిక విసంబు మున్నాల్కకొనను గండ, చక్కెరయుఁ గాఁ జెక లటి కేఁ జందురుండ!
సీ. కడలి హాలు మాయి యింగల పు వేంద్రమునకు నెత్తురు పొత్తయి నెగడినావు
ముజ్జగంబులఁ నొక్క మొగినీలు గావించు విసముతోడను గూడ వెలసినావు
లిగ కొట్టు కలసూదు మొగపుఁ దామరనున్న నిప్పుకన్నొంతల నొప్పినావు
వెఁడి గుబ్బలి సామి బండి గల్లుగ నుండి చిలువ యూర్పుల వేఁడి చెందినావు
తొలుత నుండియుఁ బలువల చెలిమిఁ బెంపుఁ, గనిన నీకెక్కుడిది మంచితనము; చెలుల
నెనరు డిగనాడి యుడుకు వెన్నెలలఁ బఱపి, సిలుగులను బెట్టు చుం డెను కలువ ఱేఁడ!
సీ. తమిఁ బట్టి విడిచిన తల గా మెఱుంగు నీ బొందివిసంబొ? నేల్పులకుబువ్వొ?
వాఁడిన తమ్మి పూఁబోఁడి యెఱుంగు నీ చాయ గాటపుఁ జూచ్చొ? చల్లనిదియొ?
జలక మైపాఱు జాబిలి రాలెఱుంగు నీకై వాఁడిదో? యోర్మి గలిగినదియొ?
కవ పీడి కుండు జక్కవ పుల్గు లెఱుఁగు నీ కర్జంబు గుజసొ? సుగంబు గలదొ?
కలికి గోల్పడ్డ నీయొజ్జ గారెఱుంగు, నీవు తులువవో? సుగుడివో? నిక్క మమగఁ;
గటకటా! నీకును బెట్టంగ నిక తముని, నెవ్వరును నిన్ను జూచి గా నెంచ రెదల".
గీ. అనుచుఁ గలువరవార నాడియలరు బోఁడి, వేంద్రమును జూపి మాటికి వీచుచున్న
కమ్మతెమ్మెరఁ బాడగ నిగడితముగను, దిట్టఁ దోడఁ గెనుముదినల్క పట్టలేక. 184
గీ. "నిన్ను విసదాల్ము క్రమింగఁ గ నిలువ లేక, పాఱిపిస దార్ల పేరునఁ బరగుచున్న
నీరు తాల్పులఁ దటి మెదు నీవు నొక్క, బల్లిదుండ వెదో కరువలిని సుంగ! 185
గీ. వలుపు గుబ్బలి చిలువ రావాయి నుండి, వెడలి పెతరుల యెకిమాని వీట మెలఁగి
నట్టితులువవు చెలుల పైన లుకచూప, వెనుక దీయుడు వేనీవ్వ పిసమైన". 186
వ. అని గాలింగూల నాడి చిలుకలుకోయిలలు మొదలగు పలుగు పులుఁగులఁ దలఁచి
యిట్లనియె.

క. లలి నేను బెంపఁ జెరిగితి, వలఁచుట నాయందె నన్నె ; యక్కట ! యూరా
చిలుకా ! చదివించినయొ, జలకేవంకలను బెట్టు చందమునని సీ. 188

గీ. అరయ నామని శ్రేఁడు నెయ్యమున నీవు, సిరుల సంగటకొ్రమ్మావి చిగురు లాగి ని
మెక్కుటవుఁగాని మముబోటి మెలఁతుకలను, పిలుగ లిడుటవు గాదు కోయిల పుల్గుఁగ!

క. తాటోటుమరుని యానతి, బోటుల నలయింపఁ బెగువఁ బూనుట మేలా?
యేటికి మొఱపెదు సిగ్గఱి, మాటికిఁ బూఁదేనెఁ ద్రావి మత్తిలి తేఁటీ!" 190

గీ. అనుచుఁ దెగడుచు నున్నయయ్యాదను నందు, మంజుభాషిణి దను దెంచి మగువ కెన్న
చలువ కర్జమ్ము లానరించి చాలఁగూర్మి, గలుగు దాని తెరంగునఁ బలికె నిట్లు. 191

ఆ. "తలఁపున నందకూర్మి మెలఁగను వలరేఁడు, చదలు నందలిరుగు చందమామ
కంటఁ బడఁడు చలువగాలి దేవరోకప్పు, డెట్టు నీరి వలనఁ నెగ్గు పుట్టు. 192

ఆ. నీదు కంటఁ బడిన నిలుచు నేసిరిపట్టి, పడగలోతు నీటఁ బడను గాక
నీదు పలుకు వినిన నిలుచు నేరంచిల్క, తోఁకఁ ద్రెంచుకొనుచుఁ దొలఁగు గాక" 193

వ. అని పలుతెఱంగుల నెచ్చరించు నయ్యింతి నంతిపురికిం దోడుకొనిచనియె నంత. 194

సీ. తిగవేసముల సామి తేరిమ్రోలను గల్పు డాకోల్పు మగటాలడవిణయనఁగఁ
జీఁకటియను చెట్టు చిగురులు మెక్కు జేజేహత్తియె త్తినచేయియనఁగఁ
గలువలనూడు శేర్గజపెడుదోరతలనడరుము త్తెంపు బొమ్మిడికమనఁగఁ
జక్కవకవమీఁదఁ జక్కెరబిలుకాఁడు చిలికిన క్రొంబువ్వు చిలుకనంగఁ
జేనియలు ద్రావి తుమ్మెదదిమ్ము సొక్కు, విరివిజిగులను దనరు దివ్వియలు సుక్క
మింటవెన్నెల వెలఁదినెమ్మేను చిక్క, వెలిగెఁ దొలికడమలనీఁద వేఁగుచుక్క 195

ఉ. పాయపుటాల్మగల్ వెఱగుపాటున నొండొరుఁగాఁగిలించియా
హాయిచె తెల్లవారెనని హాకినిగూడఁగఁ జాగిరెంతయున్;
దీయని వింటిదంటదొనదిం చెనుమాపులఁ; నంతఁ గొక్కురో
కోయని కాలివాల్పులుఁ గుకూటువగూసి; సురింగఁ జీఁకటుల్. 196

చ. తనగడిఁ దంప్రభా[illegible]లను తాప్రఖులఁ జీఁకటిసంద్రమందు మున్

గినమేయిదారికిహాటువను నెమ్మి మెయిన్బయికెత్తవచ్చెనా
గనుబొడిచెన్ బోటుకుక్కననుగల్వలనూడ్చోగిఁ దూర్పుగట్టుమీఁ
దనుదొలిచక్కియన్వ్రేలదితాల్చినకుంకుమచుక్కయోయనన్. 197

క. చిలువలపేరుకుత్తికను; జేతులయుమ్మ్రనవాలుఁబున్కయున్
నెలయునువేల్పుజాలుదల; నెన్నొసటంబలుకిత్తికన్నుఁ;బు
వ్విలుదొరబూది మై; మొలనువింగడపుంబెనుదువ్వితోలునున్
వెలయఁగముజ్జగంబులను; బేర్మినిసాకెడుమేటిదయ్యమా; 198

సుగంధివృత్తము

వేఁడివేల్పుముద్దుబిడ్డవెక్కసంపుటల్కమై
వాఁడిచూపసైఁపలేకబాసవాల్ నినుంగునిన్
వేఁడగోడుమాడలేకవేడబంబుమీఁజ
క్కాడిచాలమేలుగూర్చికాచినట్టివేలుపా!

మాలినీవృత్తము.

కొలలనడఁచుప్రోడా! కొండవీడేలుఱేఁడా!
చిలువనగలవాఁడా! సేగిసంద్రంపుటోడా!
బలుగొనములతిట్టా! వాసిగన్నట్టిదిట్టా!
కలుములొసఁగువేల్పా! గట్టురావింటితాల్పా!

గద్యము. ఇదిశ్రీమదాపస్తంబసూత్రకౌశికసగోత్రపవిత్రజయంతికులకలశార్ణవరాకాకైరవమిత్రభావనారాయణపౌత్రరామనార్యపుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫలశ్రీమదాకుండివ్యాసమూర్తిదేశికపదసేవాపరాయణ భావనారాయణప్రణీతంబయినకళావతీపరిణయంబను శుద్ధాంధ్రప్రబంధంబునందుద్వితీయాశ్వాసము.

శ్రీభీమలింగార్పణమస్తు.

